# నెహ్రూ ప్రభుత్వం ధరల స్థిరీకరణ సమస్యలో ఎందుకు విఫలమౌతోంది?

రచన :
పరకాల పట్టాభిరామారావు

విశాలాంధ్ర ప్రచురణాలయం,
విజయవాడ.

# ధరల పెరుగుదలలో ఒక దేశానికీ మరో దేశానికీ పోలికలేదు

బొంబాయిలో సెప్టెంబరు 24 వ తేదీ ధరలు పెరుగుదల సమస్యపై ఒక సదస్సు జరిగింది. ప్రొఫెసర్ గాడ్గిల్ ఈ సదస్సులో ఉపన్యసిస్తూ, ప్రపంచమంతటా ధరలు పెరిగాయి కాబట్టి, మన దేశంలో పెరిగాయి అనే వాదనలు ప్రజలను పూర్తిగా తప్పుదోవ పట్టిస్తాయి. అన్ని దేశాలలోను చాలావరకు ఆ యా దేశాలు అవలంబించే విధానాలనుబట్టి ధరలు పెరగడంకాని, తరగడంకాని జరుగుతుందన్నారు. పారిశ్రామికంగా అభివృద్ధి పొందిన దేశాలలో సాంఘిక భీమా భద్రతాచర్యలు బాగా వ్యాప్తిలో ఉన్నాయనీ, వాడకం వస్తువుల ధరలు పెరిగినప్పుడు తగు నష్టపరిహారంకూడా యివ్వబడుతుందన్నారు.

# ముందుమాట

నెహ్రూ ప్రభుత్వం ధరల స్థిరీకరణ సమస్యను ఎందుకు పరిష్కరించ లేకపోయిందో ఈ పుస్తకంలో వివరించబడింది. ధరలు పెరిగిపోకుండా అరికడతామని ప్రభుత్వం ఎప్పటికప్పుడు చెబుతున్నప్పటికి ఆచరణలో ఏమీ చేయలేకపోతూంది. ప్రభుత్వం చేసిన తీర్మానాలు కార్యరూపం ధరించటం లేదు.

బ్యాంకు వ్యాపారం ఆహారధాన్యాల వ్యాపారం ప్రైవేటు యాజమాన్యం క్రిందనే ఉండటంవలన, దేశంలో చట్టా వ్యాపారం, అధిక లాభార్జన, విచ్చలవిడిగా సాగుతున్నాయి. జీవితావసర వస్తువుల ధరలు పెరిగిపోవడానికి ప్రధానకారణాలు. దీనికితోడు ప్రజల జీవితావసరవస్తువులపై బడే పరోక్ష పన్నులను ప్రభుత్వం విపరీతంగా పెంచివేసింది. దీనివలన కూడా ధరలు పెరుగుతున్నాయి. ప్రణాళిక వనరులను సేకరించడానికి ప్రభుత్వం వందలకోట్ల రూపాయల కరెన్సీని అదనంగా చెలామణీలోకి తీసుకొనివచ్చింది. దేశ ఉత్పత్తి పెరుగుదలతో నిమిత్తం లేకుండా ప్రభుత్వమూ, ప్రైవేటు బ్యాంకులూకలిసి అదనంగా ఏమేరకు ద్రవ్యచలామణీని తీసుకున్నారో, ఆ మేరకు ద్రవ్యోల్బణం, తత్ఫలితంగా ధరలు పెరగడం సంభవించుతూంది. హద్దు మీరి అవలంబించిన ఈ ఋణగ్రస్త ద్రవ్య

విధానం కూడా ధరల పెరుగుదలకు దోహదం చేసింది. ఈ లోపాలన్నీ సవరించనిదే పైపై మాటలు ఎన్ని చెప్పినా, ధరల స్థిరీకరణ సమస్య పరిష్కారం కాదని గత కొలది సంవత్సరాల అనుభవం రుజువు చేస్తున్నది.

ప్రస్తుత ఆర్థిక విధానంలో వున్న యీ వైరుధ్యం కేంద్ర ఉద్యోగుల సమ్మెతో అతిస్పష్టంగా బైటపడింది. కనీస జీతాలు పెంచాలనీ, ధరల పెరుగుదల కనుగుణ్యంగా వేతనాలు పెంచాలనీ వీరు కోరారు. ప్రభుత్వమే గనుక ధరలను స్థిరీకరించి వున్నట్లయితే, కేంద్రఉద్యోగులు అసలు సమ్మె చేయవలసిన పరిస్థితే యేర్పడేది కాదు.

ఇదిలా వుండగా స్వతంత్రపార్టీ యిటీవల ద్రవ్యోల్బణ వ్యతిరేక వారోద్యమమంటూ జరిపింది. ఈ అధిక ధరలకు ద్రవ్యోల్బణానికి ప్రణాళికలే మూలకారణం కనుక, అసలు ప్రణాళికలే వుండకూడదని స్వతంత్రపార్టీ నాయకులు శ్రీ రాజాజీ, శ్రీ మసానీగారలు మద్రాసు బహిరంగసభలో ప్రసంగాలు చేశారు. శ్రీ రాజగోపాలాచారి దీనికి "డాంబిక" ప్రణాళిక అని పేరుపెట్టారు.

అధిక ధరల వలన ప్రజలలో ఏర్పడిన అసంతృప్తిని అవకాశంగా తీసుకొని, ప్రణాళికలనే ఎగరగొట్టడానికి అభివృద్ధి నిరోధక శక్తులు ఏవిధంగా ప్రయత్నిస్తారో దీనివలన బోధపడుతుంది. వాస్తవానికి అధిక ధరలను తగ్గించాలంటే తీసుకోవలసిన నిర్దిష్ట చర్యలకు స్వతంత్ర పార్టీ ఒప్పుకోదు. ప్రత్యక్ష పన్నులను హెచ్చించడానికి, చట్టా వ్యాపారాన్ని నిషేధించడానికి, బ్యాంకు వ్యాపారాన్ని జాతీయం చేయడానికి,

మధ్యదళారులను తొలగించి ఆహారధాన్యాల వ్యాపారాన్ని ప్రభుత్వమే నిర్వహించడానికి, అధిక లాభాల పన్ను విధించడానికి మొదలయిన యీ చర్యలన్నింటికి స్వతంత్ర పార్టీ పూర్తిగా వ్యతిరేకం. పరిశ్రమలు, వ్యాపారం యావత్తు ప్రైవేటురంగం చేతుల్లోనే ఉండాలనే "స్వేచ్ఛా వ్యాపార విధానం" స్వతంత్ర విధానం అయినప్పటికీ,తమ నిజస్వరూపాన్ని దాచుకొని అధిక ధరలవలన ప్రజలు బాధపడుతున్నారని మొసలి కన్నీరు కారుస్తోంది. దీని నవకాశంగా తీసుకొని ప్రణాళికా వ్యయాన్ని తగ్గించివేయాలనీ, ప్రణాళికా బద్ధమైన ఆర్థిక విధానమే ఉండకూడదని పెద్ద ప్రచారం లేవదీస్తున్నది. భారత బడా బూర్జువావర్గానికి చెందిన బిర్లాగారి పత్రిక ఈస్టర్న్ ఎకానమిస్టు కూడా ధరల స్థిరీకరణలో ప్రభుత్వ వైఫల్యాన్ని అవకాశంగా తీసుకొని, ప్రణాళికలపైన ప్రభుత్వ విధానాలపైన విరుచుకుపడుతూంది. ప్రణాళికల హెచ్చు వ్యయమే ద్రవ్యోల్బణాన్ని సృష్టించింది గనుక, ప్రణాళిక వ్యయాన్ని తగ్గించివేయాలని వాదించుతూంది.

ప్రణాళికాబద్ధమైన ఆర్థికవిధానం పురోగమించకుండా, అడుగడుగునా దానిని భగ్నం చేయడానికి జరుగుతున్న ఈ ప్రచ్ఛన్న యుద్ధాన్ని అంతంచేయాలంటే, ప్రభుత్వం ఏ యే చర్యలు తీసుకోవాలో యీ పుస్తకంలో వివరింపబడింది.

విజయవాడ,
12-10-60.

—రచయిత

# అధిక ధరలపై సాగించాల్సిన పోరాటం

## ఉద్యోగుల వివాదమా ?

ప్రణాళిక బద్ధమైన ఆర్థిక పురోగమనానికి ధరల స్థిరీకరణ ఒక ప్రధానమైన ప్రాతిపదిక. ధరలను అదుపులో వుంచలేకపోతే, ఆర్థికవ్యవస్థ సుస్థిరంగా వుండదు. అస్థిరకల్లోలమవుతుంది. రూపాయి విలువ పడిపోతుంది. వేతనాల విలువ పడిపోతుంది. ప్రజల కొనుగోలుశక్తి పడిపోతుంది. అంతేకాదు. ప్రణాళిక వ్యయంకూడా పెరిగిపోతుంది. అనుకున్న లక్ష్యాలు నెరవేరవు.

ధరలు పెరిగిపోతే ముఖ్యంగా ఆ ఫలితం అనుభవించేది దేశంలోని అత్యధిక సంఖ్యాకులైన పేద, మధ్య తరగతివర్గాలు. పెరిగిపోయే ధరలతో ఆదాయాలు పెరుగక కనీస జీవితావసరాలు తిండీ, బట్టా కూడా కొనుక్కోలేక దుర్భరపరిస్థితులకు గురి అవుతారు. వారిలో తీవ్ర అసంతృప్తి యేర్పడి అక్కడ నుండి పరిస్థితులు తీవ్రరూపం దాలుస్తాయి.

దురదృష్టవశాత్తు ఇటీవల మనదేశంలో అటువంటి తీవ్రరూపందాల్చిన పరిస్థితులే సంభవించాయి. అదే కేంద్ర ప్రభుత్వోద్యోగులు జరిపిన సమ్మె !

మనకు స్వాతంత్ర్యం లభించి పదమూడేళ్ళు కావస్తున్నది. ప్రణాళికలంటూ ప్రారంభించి దాదాపు పదేళ్లుగా వస్తున్నది. దేశంలో నిస్సంశయంగా పారిశ్రామికాభివృద్ధి జరిగింది. అనేక జల విద్యుత్ ప్రాజెక్టుల నిర్మాణం జరిగింది. ఉత్పత్తి పెరిగింది. జాతీయాదాయం కూడా పెరిగిందికాని అధికధరలవలన, సమాజంలోనివ్యత్యాసాలు ఈ రెండుప్రణాళిక కాలాల్లో ఏమీ మార్పు చెందకపోవడం వలన ఈ జాతీయాదాయం సామాన్య ప్రజల జీవన ప్రమాణాన్ని పెంచ లేదు. అశేషకార్మిక జనసామాన్యంతో బాటు, మధ్యతరగతుల వారుకూడా ప్రభుత్వంపై తీవ్రఅసంతృప్తి చెందారు. సమ్మెలు, పోరాటాలూ జరిపి పేద, మధ్యతరగతి వర్గాలు తమ అస్థిత్వం నిలబెట్టుకొంటాయి. తమ బ్రతుకు తెరువు కోసం తెగించి సంఘర్షణకు దిగుతాయి. అప్పుడు వారిని తప్పుపట్టవలసిన అవసరం ఏమీలేదు. ఎవరో వారిని రెచ్చగొట్టారని అన్నా, దానికి విలువా ఉండదు. ప్రయోజనమూ ఉండదు.

ప్రభుత్వంలో వున్నవారు దూరదృష్టి కలవారైతే ఇటువంటి అసంతృప్తికర పరిస్థితులు ఏర్పడకుండానే చూడాలి. ఒకవేళ ఏర్పడితే వెంటనే ఆ పరిస్థితులను చక్క దిద్దాలి. అంతేకాని అసంతృప్తి చెందినవారిని తెగనాడ కూడదు. దండించ పూనుకోకూడదు. అందువలన అసంతృప్తికర పరిస్థితులు పరిష్కారం కావు, సరికదా గోరుచుట్టుమీాద రోకటిపోటులా అసలే దుర్భర జీవితాలు గడుపుతున్న వారి స్థితి మరింత దుర్భర మౌతుంది. మరింత అసంతృప్తి పెరిగి ప్రభుత్వంపై ఆగ్రహావేశాలు వెల్లుబుకుతాయి.

చివరకు ప్రభుత్వంక్రింద పనిచేసే ఉద్యోగులే ప్రభుత్వానికి వ్యతిరేకంగా సమ్మె కట్టవలసిన పరిస్థితి యేర్పడింది. కనీస జీతం నిర్ణయించాలనీ, ధరల పెరుగుదల కనుగుణ్యంగా ఎలవెన్సులు పెంచాలనీ కేంద్ర ఉద్యోగులు కోరిన న్యాయమైన కోర్కెలను ప్రభుత్వం తీర్చలేకపోవడంతో 1960 జూలై 11 నుండి 16 వరకు ఉద్యోగులు సమ్మె చేశారు.

ప్రభుత్వ యంత్రాంగానికి వెన్నెముకగా వుండే ఉద్యోగులు అసలు సమ్మె తలపెట్టడమే ప్రభుత్వ విధానాలకు పెద్ద ఓటమి. ఇంత పెద్దఓటమిని ప్రభుత్వం యెందుకు పొందిందో తెలుసుకోవాలంటే ప్రభుత్వ ఆర్థిక విధానాలలో లోపం ఎక్కడున్నదో తెలుసుకోవాలి.

## ఉత్పత్తి పెరిగింది: ధరలు ఎందుకు తగ్గలేదు ?

“ఉత్పత్తి పెంచండి — మీ వేతనాలు పెరుగుతాయి. దేశసంపద పెరుగుతుంది. సరకులు పుష్కలంగా ఉంటే ధరలు తగ్గుతాయి” అని శ్రీ నెహ్రూ దేశప్రజలకు వాగ్దానం యిచ్చారు.

దేశప్రజలు కష్టించారు. ఉత్పత్తి పెరిగింది. పెరిగినమాట ప్రభుత్వ లెక్కలే చెబుతున్నాయి. ఏవిధంగా పెరిగిందో చూడండి:

### ఉత్పత్తి పెరుగుదల సూచీ సంఖ్యలు

| | 1955 | 1959 |
|---|---|---|
| పంచదార | 143 3 | 154.6 |
| తేయాకు | 1 6.0 | 1:6.8 |
| వనస్పతి | 151.3 | 185.0 |
| సిగరెట్లు | 1 6 4 | 116.0 |
| బట్టలు | 111 9 | 111 0 |
| జనపనార వస్తువులు | 118 9 | 124.6 |
| కాగితం | 140 2 | 212.9 |
| సిమెంటు | 149.4 | 208.7 |
| గోధుమపిండి | 1'0.7 | 180.3 |
| ఇనుము - ఉక్కు | 113.3 | 103.4 |
| పాదరక్షలు | 97 1 | 1:8 6 |
| ఆహారధాన్యాలు | 115.3 | 128.2 |

ఇవి 1959 వరకు మాత్రం. పారిశ్రామికోత్పత్తి సూచీ సంఖ్య 1959 లో 151 వుంటే 1960 లో 189.7 కు పెరిగింది. (ప్రాతిపదిక 1951 లో 100). వ్యవసాయోత్పత్తి సూచీసంఖ్య 1955 లో 117.0 నుండి 1959 లో 131.0 కి పెరిగింది. ఆహార ధాన్యాలు 1955 లో 6 కోట్ల 57 లక్షల టన్నులు పండితే 1959 నాటికి 7 కోట్ల 35 లక్షల టన్నులకు పెరిగాయి.

కాని, ధరలు క్రమక్రమంగా పెరిగిపోతూవచ్చాయి.

ద్వితీయ ప్రణాళిక ప్రారంభమైన 1956 నుండి 1960 జనవరి వరకు టోకు ధరలసూచీ సంఖ్య 18.8 శాతం పెరిగింది. అంటే సంవత్సరానికి దాదాపు 4.7 శాతం పెరిగాయన్న మాట. ఆహార ధాన్యాల ధరలు మరీ విపరీతంగా పెరిగి పోయాయి. నాల్గు సంవత్సరాలలో 23 శాతం పెరిగాయి. ఈ ధరలు 1959 _ 60 లో ఎలా పెరిగిపోయాయో చూడండి.

| | టోకుధర | సూచీసంఖ్య | |
|---|---|---|---|
| | 1956 | 1959 | 1960 |
| ఆహార పదార్థాలు | 89.4 | 111.3 | 117.7 |
| వంటచెరకు వగైరా | 95.7 | 114.9 | 117.1 |
| పారిశ్రామిక వస్తువులు | 111.1 | 118.4 | 121.1 |
| అన్నిరకాల సరుకులు | 95.3 | 112.4 | 118.9 |

ఆహారపదార్థాల గ్రూపులో పంచదార, బెల్లం, పాలు మాంసం, సుగంధద్రవ్యాలు టీ మొదలైనవి ఉన్నాయి.

ఇవి టోకు ధరల సూచీ సంఖ్యలు మాత్రమే. చిల్లర ధరలు ఇంతకంటె ఎక్కువే పెరిగిపోయాయి. నిత్య జీవితావసరాల వస్తువులు కొనలేక నూటికి 90 మందిగా ఉండే పేద, మధ్య తరగతులవారు తల్లడిల్లే పరిస్థితులు ఏర్పడ్డాయి.

## విజయవాడ చిల్లర ధరలు

| | 1947 | 1930 | రెట్లు |
|---|---|---|---|
| బియ్యం శేరు | 0- 6-6 | 0- 2-0 | 2 |
| ఉప్పు ,, | 0- 1-6 | 0- 1-3 | 2½ |
| మిర్చి వీశె | 0- 8-0 | 4- 0-0 | 8 |
| చింతపండు వీశె | 0- 4-0 | 3- 0-0 | 12 |
| కట్టెలు సలక | 0- 8-0 | 2- 0-9 | 4 |
| బొగ్గులు బస్తా | 1- 8-0 | 6- 0-0 | 4 |
| కందిపప్పు శేరు | 0- 5-0 | 0-12-0 | 2½ |
| మినపప్పు ,, | 0- 6-0 | 0-12-0 | 2 |
| నువ్వుల నూనె వీశె | 0-12-0 | 3- 8-0 | 4½ |
| వేరుశనగ నూనె ,, | 0- 8-0 | 2- 8-0 | 5 |
| కాఫీ గింజలు ,, | 2- 0-0 | 7- 8-0 | 3¾ |
| పంచదార ,, | 0- 8-0 | 1-11-0 | 3¼ |

పత్తివ్యాపారంలో చట్టావ్యాపారులు తీసిన అపరిమిత లాభాలవలన నూలుధరలు పెరిగిపోయాయి. 1959 ఫిబ్రవరి 1960 ఫిబ్రవరిమధ్య 20 సెంటకు నూలుధరలు, వస్త్రాల ధరలు నూటికి 40 వంతుల వరకు పెరిగాయి. చివరకు పెట్టుబడిదారీ వర్గ పత్రికలుగూడా యీ ధరల పెరుగుదల ఫలితాలు మధ్య తరగతులలో విపరీత ఆందోళనకు, అల్లకల్లోలానికి దారి తీస్తాయని భయం వెలిబుచ్చే పరిస్థితి యేర్పడింది.

బిర్లా పత్రిక ఈస్టరన్ ఎకనామిస్టు 1959 మార్చినెల బడ్జెట్ ప్రత్యేక సంచికలో యేమని వ్రాసిందో చూడండి:

"నిర్ణీత ఆదాయాలు, వేతనాలుకల వర్గాలు, ముఖ్యంగా రు. 500 ల లోపు జీతాలుకల ప్రభుత్వోద్యోగులు ఈ అధిక ధరల ఫలితంగా విపరీతమైన ఆందోళన పడుతున్నారు. రు. 500 లు 500 లోపు జీతం కల్గిన ప్రభుత్వోద్యోగుల సంఖ్య మొత్తం ప్రభుత్వ యంత్రాంగంలో హెచ్చు. వీరి నిజ ఆదాయాలు (నిజ ఆదాయాలంటే, నగదు రూపంలో వచ్చే ఆదాయాలు వస్తు రూపంలోకి మారిస్తే లభించేవి) ఈ విధంగా పడిపోవడానికి ప్రభుత్వం అంగీకరిస్తే, ఈ భారంతో నడుములు విరిగిపోయేవరకు మాట్లాడక ఊరుకుంటే వీరు అన్నిటికీ తెగించే పరిస్థితికి నెట్టడం అవుతుంది."

అంటే యీనాడు ప్రభుత్వోద్యోగులు తెగించి సమ్మె కట్టడానికి భౌతిక పరిస్థితులు యేర్పడ్డాయని యీ బూర్జువా పత్రికే ఒప్పుకుంటూంది. ఈ పత్రిక చెప్పినట్లు ఉద్యోగులు అన్నింటికి తెగించే యీ స్థితికి వచ్చారు. వారు, పెరుగుతున్న ధరలను అరికట్టమని కోరారు. లేదా పెరుగుతున్న ధరలతో

బాటు తమ అధిక ధరల ఎలవెన్సును పెంచమన్నారు. కాని ప్రభుత్వమూ, ప్రభుత్వం తరఫున వాదించే ఆర్థికవేత్తలూ మరో వక్ర సిద్ధాంతాన్ని లేవదీశారు. అదేమంటే వేతనాలు పెంచితే ఉద్యోగుల కొనుగోలుశక్తి పెరిగి సరుకులకు గిరాకీ ఏర్పడుతుందనీ, అందువలన ధరలు మరింత పెరుగుతాయనీ వీరి వాదన. ప్రధాని నెహ్రూకూడా యీ విచిత్రవాదనను లేవనెత్తారు. ప్రణాళికలలోను ప్రభుత్వ ఎవార్డులలోకూడా యిదే వాదన కనిపిస్తుంది.

## వేతనాలు పెంచితే ధరలు పెరుగుతాయా ?

మొదటి పంచవర్ష ప్రణాళిక అమలుజరిపే సమయంలో వేతనాలు పెరగకుండా నిలిపి వుంచాలని, ప్రణాళికా రచయితలు చెబుతూ ఇలా అన్నారు: "నోట్ల ముమ్మరాన్ని అరికట్టాలంటే ప్రణాళికా కాలంలో లాభాలను, వేతనాలను కొంతవరకు అదుపులో పెట్టాలి. వేతనాలు పెరిగితే సరకుల ఖరీదులుకూడా పెరుగుతాయి." ఇందులో వేతనాలను అదుపులో పెట్టడానికి ప్రభుత్వం తయారైందే కాని లాభాలను అదుపులో పెట్టడానికి ఎంతమాత్రం ప్రయత్నించలేదు. అపరిమిత లాభాలకు ప్రభుత్వం ఎప్పుడైతే అవకాశం యిచ్చిందో అప్పుడే సరకుల ధరలు పెరగడానికి అవకాశం యిచ్చినట్లే. వాస్తవంలో అదే జరిగింది. కార్మికుల వినిమయ సరకుల ధర సూచీ సంఖ్యలనూ, వారి వేతనాల పెరుగుదల సూచీ సంఖ్యను చూస్తే ఈ వేతనాలు పెంచడంవలన ధరలు పెరగలేదనీ, ధరలు పెరగడంవలననే వేతనాలు పెంచాలనే ఆందోళన కలుగుతున్నదనీ స్పష్టమవుతూంది.

కేంద్రగణాంక సంస్థవారు తయారుచేసిన లెక్కల ప్రకారం వేతనాలు పెరిగినంత మాత్రాన ధరలు పెరగనక్కర లేదని స్పష్టమవుతూంది. పెద్ద పరిశ్రమలలో కార్మికుల వేతనాలు 20 శాతం పెరిగితే వ్యవసాయ సరకుల ధరలు 0.05 శాతం మాత్రమే పెరుగుతాయి. చిన్న పరిశ్రమలలో కార్మికుల వేతనాలు 20 శాతం పెరిగితే వ్యవసాయ సరకుల ధరలు 0.61 శాతం మాత్రం పెరుగుతాయి.

అందుచేత పారిశ్రామిక కార్మికుల కొనుగోలు శక్తి పెరిగితే వ్యవసాయ సరకుల ధరమీద చెప్పుకోదగిన ప్రభావం ఏమీ ఉండదు. కాని పరిశ్రమలలో వ్యవసాయ సరకుల వాడకం గణనీయంగా (ముడిపదార్థాల రూపంలో) ఉంటుంది గనుక వ్యవసాయ సరకుల ధరలు పెరిగితే వాటి ప్రభావం ఇతర రంగాలపై మాత్రం ఉంటుంది.

ధరల పెరుగుదలకు, వేతనాల పెరుగుదలకు ఏమీ సామ్యంలేదని ఈ క్రింది అంకెలవలన బోధపడుతుంది.

## కార్మికుల వినిమయ సరకుల ధర సూచీ సంఖ్య

| | అఖిల భారత సూచీ | ఆహార ధరలు |
|---|---|---|
| 1955 | 98 | 92 |
| 1957 | 105 | 105 |
| 1957 | 111 | 112 |
| 1958 | 116 | 118 |
| 1959 జనవరి | 117 | 119 |
| 1959 డిసెంబరు | 124 | 128 |

(1939 లో 100 అనుకుంటే) అదే సమయంలో కార్మికుల నిజవేతనాల పెరుగుదలను చూదాం:

| | ఉత్పత్తి | ఉత్పాదక శక్తి | వినియోగవస్తువుల ధరలు | నిజ వేతనాలు |
|---|---|---|---|---|
| 1939 | 100 | 100 | 100 | 100 |
| 1949 | 108.4 | 75.5 | 371 | [illegible]1.7 |
| 1957 | 186.4 | 117.2 | 409 | 105.0 |

అంటే 1939–57 ల మధ్య ఉత్పత్తి 86.4 శాతం, ఉత్పాదకశక్తి 17.2 శాతం, ధరలు 309 శాతం పెరిగితే, నిజ వేతనాలు 5 శాతం మాత్రం పెరిగాయి. మన ప్రణాళికా రచయితలు, ఆర్థికవేత్తలు చెప్పిన సిద్ధాంతం ప్రకారం వేతనాలు 309 శాతం పెరిగినందున ధరలు పెరగలేదు. అందుచేత వేతనాలు పెంచితే ధరలు పెరుగుతాయన్నది వక్ర సిద్ధాంతం తప్పితే వాస్తవం కాదు. ఇది నిత్య జీవితంలో స్పష్టంగా కనిపిస్తూనే వుంది. ప్రభుత్వం ధరలను అరికట్టలేకపోయింది. ఈ వైఫల్యాన్ని దాచుకోడంకోసమే ఈ వాదన తెస్తూంది.

వేతనాలు పెంచితే ధరలు పెరుగుతాయనే వాదనను సంస్కరణవాద కార్మిక సంస్థలు, కడకు ప్రభుత్వానికి వత్తాసుగా ఉండే జాతీయ ట్రేడ్ యూనియన్‌వంటి సంస్థలుకూడా ఆమోదించడం లేదు. బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు 1957 సెప్టెంబరులో ఒక తీర్మానం చేస్తూ ధరలను, లాభాలను అదుపులో పెట్టకుండా కార్మికుల వేతనాలను అదుపులో పెట్టాలనే సూత్రానికి తాము వ్యతిరేకమని స్పష్టం చేసింది.

అమెరికన్ ఫెడరేషన్ ఆఫ్ లేబరు తరఫున నడపబడు తున్న మాసపత్రిక 1957 జూన్‌లో ధరలు వేతనాలు గురించి వ్రాస్తూ, "జీతాల పెరుగుదల వలన ధరలు పెరుగుతా యన్న వాదన శుద్ధ తప్పని బ్యూరో ఆఫ్ లేబర్ స్టాటిస్టిక్స వారి లెక్కలు స్పష్టం చేస్తున్నాయి" అని వ్రాసింది.

మరి....ధరలు ఎందుకు పెరుగుతున్నట్లు ?

ప్రభుత్వం ప్రణాళికలనైతే వేసింది కాని, దేశ ఆర్థిక వ్యవస్థపై పెట్టుబడిదారీవర్గం ఆధిపత్యాన్ని అదుపు చేయలేక పోయింది. రెండవ ప్రణాళిక ముగింపు దశకు వస్తున్నప్పటికీ ప్రభుత్వరంగం ప్రైవేటు రంగంపై ఆధిపత్యం వహించా లన్న ప్రణాళిక ఆశయం నెరవేరలేదు. ప్రైవేట్ రంగం తన చిత్తం వచ్చినట్లు అపరిమిత లాభాలను తీస్తూ, ధరలను తన యిష్టం వచ్చినట్లు రూపొందించుతూంటే ప్రభుత్వానికి ఏమీచేయలేని నిస్సహాయ స్థితి ఏర్పడడమే కాదు. అనేక సందర్భాల్లో ప్రభుత్వ విధానాలను కూడా పరోక్షంగా పెట్టుబడిదారీ వర్గం నిర్ణయించే స్థితి ఏర్పడింది.

ఇందుకు ఒకేఒక ఉదాహరణచాలు : బ్యాంకువ్యాపారం ప్రైవేటు యాజమాన్యంక్రింద ఉంది. ఆహారధాన్యాలను ఇతర జీవితావసర వస్తువులను కొని నిల్వజేసేవారికి బ్యాంకులు తక్కువ వడ్డీలకు అతిధారాళంగా అప్పులు యిచ్చాయి. చట్టా వ్యాపారానికి కావలసినంత డబ్బు యిచ్చాయి. దీని ఫలితం ఏమైంది ? వ్యాపారస్తులు ఆహారధాన్యాలను, ఇతర జీవితావ సర వస్తువులను విపరీతంగా కొని నిల్వ వేస్తున్నారు. కంపెనీల వాటాలపైన, స్టాక్ పైన డబ్బుపెట్టి జూదం ఆడుతున్నారు.

ఇందువలన ధరలు పెరుగుతున్నాయేకాని తగ్గడంలేదు. జీవితావసర వస్తువులపై ఆహారధాన్యాలపై షెడ్యూలు బ్యాంకులు యిచ్చిన ఋణాలు నానాటికి హెచ్చుతున్నాయి.

## షెడ్యూలు బ్యాంకులిచ్చిన ఋణాలు

| | 1958 | 1959 |
|---|---|---|
| ఆహారధాన్యాలు | 10 కోట్ల 22 లక్షలు | 71 కోట్ల 60 లక్షలు |
| నూనెగింజలు | 7 ,, 43 ,, | 12 ,, 46 ,, |
| తేయాకు | 13 ,, 13 ,, | 11 ,, 47 ,, |
| ఇతర వ్యవసాయ సరుకులు | 14 ,, 8 ,, | 47 ,, 10 ,, |
| బట్టలు | 68 ,, 58 ,, | 67 ,, 51 ,, |

(రిజర్వుబ్యాంకు బులిటెన్)

ఆహారధాన్యాలపై ఏడు రెట్లు ఎక్కువ అప్పులు ఒక్క సంవత్సరంలోనే యివ్వబడినాయి. అందుచేతనే ఈ ఒక్క సంవత్సరంలో ఆహారపదార్థాల ధర సూచీసంఖ్య 89.4 నుంచి 114.3 కు అమాంతంగా పెరిగింది.

ఆంధ్ర ప్రదేశ్ ఆహారధాన్యాలకు సంబంధించినంత వరకు మిగులు రాష్ట్రం. అయినప్పటికీ యిక్కడకూడా ధరలు ఎంతో పెరిగిపోయాయి. దీనివెనుకనున్న రహస్యం కనుక్కోవడం ఏమంతకష్టమైన విషయంకాదు. ఆంధ్ర ప్రదేశ్‌లో ఆహార ధాన్యాలపై బ్యాంకు లిచ్చిన ఋణాలు చూడండి :

## ఆంధ్ర ప్రదేశ్ లో బ్యాంకులు యిచ్చిన ఋణాలు

(కోట్ల రూపాయలు)

| | 1958 | 1959 |
|---|---|---|
| ధాన్యం, బియ్యం | 3 కోట్ల 2 లక్షలు | 3 కో 66 ల |
| రైసు మిల్లులకు | 2 , 10 ,, | 1 ,, 96 ల |
| యితరులకు | 5 ,, 98 ,, | 1 ,,0 ల 7 |
| పంచదార, బెల్లం | 4 ,, 35 ,, | |
| ఫ్యాక్టరీలకు | 3 ,, 57 ,, | |
| యితరులకు | —30 | |

1958 రైసుమిల్లులకు 2 కోట్ల 10 లక్షలు యిస్తే 1959 లో 14 లక్షలు తగ్గింది. కాని అదేసమయంలో "యితరాల" బాపతుక్రింద చట్టావ్యాపారస్తులకు యిచ్చిన అప్పును ఒకకోటి 28 లక్షలు పెరిగాయి. ధాన్యం, బియ్యం నిల్వలపై యిచ్చిన అప్పులు 1958 లో 3 కోట్ల 2 లక్షలుంటే, 1959 లో 64 లక్షలు అదనంగా యివ్వబడినాయి. గ్రామసీమలలో పెద్ద భూస్వాములందరు ధాన్యం నిల్వ వ్యాపారస్తులుగా తయారయ్యారు. ధాన్యాలు లోను చేయించి లక్షలకు లక్షలు ప్రైవేటు, ప్రభుత్వ బ్యాంకులనుండి తీసుకున్నారు. మార్కెట్ లోకి రావలసిన ధాన్యం రాలేదు. అందుచేత కృత్రిమ కొరత ఏర్పడింది. ఈ కృత్రిమ కొరతను అవకాశంగా తీసుకొని తిండిగింజల ధరలను వర్తకులు మరింత పెంచివేశారు.

ఇదే సమయంలో మరొక ముఖ్య అంశాన్ని కూడా పరిశీలించవలసి ఉంది: దేశంలో ఒకప్రక్కన ప్రణాళిక నిర్వహణకు డబ్బు లేదని గగ్గోలుపడుతున్న దశలో బ్యాంకులు

యిస్తున్న ఋణాలు ప్రభుత్వరంగంలో కాని, ప్రైవేటురంగంలో కాని ఉత్పత్తి అధికం చేయడానికి గాని వ్యాపారానికి, చట్టా వ్యాపారానికి యిస్తూండటం గమనించ దగిన విషయం. వ్యవసాయోత్పత్తిని అధికం చేయడానికి ఇంచుమించు బ్యాంకు ఋణాలు ఉపకరించని దారుణవిషయంకూడ గమనించదగిందే. 1959 ఏప్రిల్‌నుంచి అక్టోబరు నాటికి యివ్వబడిన 936 కోట్ల బ్యాంకు ఋణాలలో పరిశ్రమలకు 418 కోట్ల 43 లక్షలు (44 శాతం) వ్యాపారానికి 375 కోట్ల 65 లక్షలు (39 9 శాతం) వ్యవసాయానికి 25 కోట్ల 25 లక్షలు (2.7 శాతం) వ్యక్తులకు 68 కోట్ల 15 లక్షలు (7.3 శాతం) వృత్తిదారులకు 9 కోట్ల 83 లక్షలు (1.1 శాతం) యితరులకు 40 కోట్లు (4.3 శాతం) యివ్వబడినాయి.

వ్యవసాయ దారునికి యిచ్చింది రు. 25 కోట్లు అంటే కనీసం వ్యక్తులకిచ్చినదాంట్లో సగం కూడా లేదు. ఇకపోతే వ్యాపారస్తుల కిచ్చిన 375½ కోట్లలో ఆహారధాన్యాలు, నూనెగింజలు వగైరా 71 కోట్ల వరకు వున్నాయి. వ్యాపారానికి, వ్యక్తులకు, యితరులకు ఇచ్చింది కలుపుకుంటే రు. 484 కోట్లు అంటే మొత్తం ఋణాల్లో సగభాగంపైన వున్నది. ఇదంతా పారిశ్రామిక, వ్యవసాయోత్పత్తి పెంపుదలకుగాక కేవలం వ్యాపారానికి యివ్వబడింది, అంటే ధరలు పెంచే మధ్యదళారీలకు వుపయోగపడుతున్నాయి తప్పితే దేశ ఉత్పత్తిని పెంచడానికి కాదు. ఎప్పుడైతే ఇంత డబ్బు వ్యాపారస్తులకు అందిందో చట్టా వ్యాపారం విపరీతంగా సాగింది.

స్టాక్ ఎక్స్ఛేంజీలలో పెచ్చు పెరిగిన ఈ చట్టావ్యాపారం గురించి బొంబాయి ఎకనామిక్ వీక్లీ వ్యాఖ్యానిస్తూ "ప్రణాళిక బద్ధమైన ఆర్థిక విధానంవల్ల ఈ వ్యాపారాభివృద్ధి రాలేదు. ఆర్థిక విధానంలో ఏర్పడిన ద్రవ్యోల్బణ పరిస్థితులవలననే వచ్చింది."

## పారిశ్రామిక వాటాల ధరల సూచీ సంఖ్య

| | 1958 జనవరి | 1960 మే |
|---|---|---|
| సిల్కు—ఉన్ని | 299.3 | 1091 3 |
| పంచదార | 156.8 | 191 2 |
| బట్టలు | 112.0 | 149.2 |
| ఉక్కు, ఇనుము | 110.7 | 170.8 |
| కాగితం | 159.0 | 235.1 |
| బొగ్గు | 87.5 | 125.0 |
| సిమెంటు | 118.2 | 147.7 |

(ఎకనామిక్ వీక్లీ, 1960 జూన్, బొంబాయి.)

"ఈ ద్రవ్యోల్బణ పరిస్థితికి విరుగుడుగా పనిచేసే సముచితమైన ద్రవ్యవిధానాలు లేకపోవడంవల్ల ఇది అడ్డు, అదుపులేక సాగుతోంది" అని తెలియజేసింది. (జూన్ 1960)

బ్యాంకుల ద్రవ్యచలామణీని అరికట్టవలసిన రిజర్వు బ్యాంకు తన విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించడంలో కృతకృత్యం కాలేదు. అప్పులను పరిమితం చేయడానికి తీసుకున్న చర్యలు ఏ మాత్రం సరిపోలేదు. సరికదా ప్రైవేటు బ్యాంకు యజ

మానులు అనేక మార్గాల్లో రిజర్వ్ బ్యాంకు నిబంధనలను, ఆదేశాలను ఉల్లంఘించి తమ మామూలుపద్ధతులను సాగిస్తునే ఉన్నారు. ప్రభుత్వం చెలామణీలో పెట్టిన ద్రవ్యం ఎంత ఉందో ఇంచుమించు అందులో సగం ద్రవ్యాన్ని చెలామణీ చేస్తున్న ప్రైవేటు బ్యాంకులు దేశ ఆర్థిక వ్యవస్థలో ఒక కీలకమైన స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. కనుక ఈ ప్రైవేటు బ్యాంకు వ్యాపారాన్ని జాతీయం చేసేవరకు పై పై చర్యలు ఎన్ని తీసుకున్నా ఫలితం దక్కదని ఆచరణలో రుజువు అవుతోంది.

## లాభాలకు ఎందుకు పరిమితి విధించరు?

ఈ అధిక ధరలవలన లాభపడింది ఎవరు? ప్రజలుకాదు, ఉద్యోగులుకాదు. పెట్టుబడిదారులు, ధనాఢ్య వర్గాలు మాత్రమే లాభపడ్డారు. ఒకవైపున ధరలుపెరిగి ప్రజలు తిండికీ, గుడ్డకూ మొహంవాచి అష్ట కష్టాలూ పడుతూంటే, వీరు అపారమైన లాభాలను ఆర్జించారు. పెట్టుబడి సేకరణకు ప్రోత్సాహం ఇవ్వాలనే పేరుతోను, ప్రైవేటు రంగానికి సముచిత స్థానం యివ్వాలనే వాదనతోను, అధిక ధరలవలన వచ్చిన అధికలాభమంతా వీరిచేతుల్లోకే పోయింది. పెట్టుబడిదారులు అమితంగా లాభాలు ఆర్జిస్తూంటే వాటికి పరిమితి పెట్టడానికి ప్రభుత్వం పూనుకోలేదు.

1939 లో వచ్చిన లాభాలు వంద అనుకుంటే 1956 నాటికి నూలు బట్టలలో 5½ రెట్లు, పంచదార 4½ రెట్లు, కాగితంలో 7½ రెట్లు, ఉక్కు, ఇనుములో 3 రెట్లు, సిమెంటులో 4 ⅓ రెట్లు లాభాలు పెరిగాయి.

ప్రభుత్వం ప్రకటించిన లెక్కల ప్రకారమే పెట్టుబడి దారీవర్గం సంపాదించిన లాభాలు చూడండి :

## పరిశ్రమలలో వచ్చిన లాభాల సూచీసంఖ్య 1939=100

| సంవత్సరం | నూలుబట్టలు | పంచదార | కాగితం | ఉక్కు.ఇనుము | సిమెంటు |
|---|---|---|---|---|---|
| 1947 | 317.7 | 171 5 | 167.7 | 86 1 | 14 .5 |
| 1948 | 548.1 | 381.3 | 257.0 | 96.3 | 252 6 |
| 1949 | 292.0 | 216.4 | 316.7 | 116 0 | 295.0 |
| 1950 | 356 6 | 262.4 | 479.0 | 134 2 | 373.4 |
| 1951 | 551.1 | 420.8 | 6[illegible]4.1 | 157.7 | 419.1 |
| 1952 | 262.3 | 40[illegible].8 | 5[illegible]6.3 | 162.6 | 293.4 |
| 1953 | 379.4 | 419 8 | 512.7 | 179 4 | 279.0 |
| 1954 | 398 9 | 336.1 | 666.1 | 2[illegible]6.3 | 341.4 |
| 1955 | 535.9 | 413.5 | 747.8 | 307.9 | 4[illegible]9.7 |
| 1956 | 568.4 | 454.5 | 749.2 | 293.3 | 43[illegible].2 |

(మంత్లీ ఎబ్‌స్ట్రాక్ట్ ఆఫ్ స్టాటిస్టిక్స్ నుండి)

అనేక రకాల రిజర్వు నిధులు, అరుగుదల నిధులు, లాభాల పంపకంపోను, తిరిగి పెట్టుబడి రూపంలో సమీకృతమైన నిధులను బట్టి చూసినా, పెట్టుబడిదారుల లాభాలు ఎంత ఎక్కువగా ఉన్నాయో చూడవచ్చు.

# ప్రైవేటురంగంలో పెట్టుబడి సమీకరణ

| | కోట్లు |
|---|---|
| 1950—51 | 890 |
| 1951—52 | 461 |
| 1952—53 | 441 |
| 1953—54 | 442 |
| 1954—55 | 470 |
| 1955—56 | 500 |
| 1956—57 | 551 |
| 1957—58 | 583 |
| 1958—59 | 6 5 |
| 1959—60 | 775 |

(ఈస్టర్న్ ఎకానమిస్టు)

ఈ విధంగా పెట్టుబడిదారులు అమితలాభాలు తీస్తే ఆ భారం యావత్తు ప్రజలపై బడింది. దేశం కోసం ప్రజలు కష్టించి పనిచేసి ఉత్పత్తి పెంచితే, ఆ లాభాలు పెట్టుబడిదారులకు దక్కాయి. జాతీయాదాయం ఏమేరకైనా పెరిగితే అది సామాన్యునికి దక్కలేదు సరికదా అధిక ధరల రూపంలో దోచుకోబడింది.

# ధరల పెరుగుదలకు దోహదంచేసే పరోక్ష పన్నులు

ప్రభుత్వం అనుసరించిన పన్నుల విధానంకూడా అధిక ధరలకు మరింత దోహదం చేసింది. ఎక్కువ చెల్లించుకునే వారిపై యెక్కువ పన్నులు, తక్కువ చెల్లించుకునే వారిపై తక్కువ పన్నులు గాక తక్కువ ఆదాయాలు కలవారిపైనే పన్నులలో యెక్కువభాగం విధించబడుతూంది. ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయి అచ్చంగా పెట్టుబడిదారీవర్గ ప్రతినిధిగా కేంద్రబడ్జెట్లను తయారు చేస్తున్నారు. ప్రణాళిక లక్ష్యాలకూ, సోషలిస్టు నమూనా సమాజ విధానానికీ యీ బడ్జెట్లకూ ఏ మాత్రం పొత్తు కుదరదు సరికదా ఆ లక్ష్యాలకు, ఆశయాలకు తిలోదాకాలిచ్చేవిధంగా రూపొందించు తున్నారు.

## మొరార్జీ బడ్జెట్

1959 మార్చి నెలలో ప్రభుత్వం కొత్త బడ్జెట్ ప్రకటించగానే బొంబాయి, కలకత్తా, మద్రాసు మొదలైన ప్రధాన నగరాలలో షేర్ మార్కెట్, స్టాక్ మార్కెట్ల ధరలు

తారాజువ్వల్లా పైకి లేచిపోయాయి. దీనికి కారణం ఏమిటి? ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయి తయారుచేసిన బడ్జెట్‌లో పన్నులభారం పెట్టుబడిదారీ వర్గాలపైగాక ప్రజలపై నెట్టి బడింది. పెట్టుబడిదారులపైబడే ప్రత్యక్ష పన్నులు తగ్గించారు. ప్రజలపైబడే పరోక్షపన్నులను హెచ్చించారు. కంపెనీల లాభాలపై పన్నులు తగ్గిపోయాయి. ప్రజల జీవితావసర వస్తువులపై పన్నులు పెరిగాయి. అందుచేత ప్రజల చేతుల్లోకి ఈ సరకులు వచ్చేసరికి మునుపటికంటే ఎక్కువధరలను వారు పరోక్షంగా చెల్లించుకోవలసి వచ్చింది.

అంటే పరోక్షపన్నులు కూడా ధరల పెరుగుదలకు దోహదం చేశాయన్నమాట. ప్రభుత్వం పరోక్షపు పన్నులను హెచ్చించకపోతే ఆ భారాన్ని కంపెనీల లాభాలపైనే విధించితే, ఆ విధంగా వారి లాభాల పరిమితిని తగ్గించితే, యీ బరువు ప్రజలపైపడేదికాదు. ధరలు ఇంత పెరిగేవికావు.

బట్టలు, కిర్సనాయిలు, పంచదార, పుగాకు, అగ్గిపెట్టెలు, వనస్పతి మున్నగు సరకులపై 1950-51, 1959-60 సంవత్సరాల మధ్య కేంద్ర ప్రభుత్వ ఎక్సైజు పన్నులు ఏ విధంగా పెరిగాయో చూదాం.

రెండు ప్రణాళికల కాలంలో రు. 86 కోట్ల నుండి (1951-52 లో) రు 320 కోట్లకు (1960-61) అంచనా, ఎక్సైజు పన్నులు పెరిగాయి అంటే 347 శాతం అన్నమాట.

ఈ పదిసంవత్సరాలకాలంలోనూ ఎక్కువ ఉత్పత్తి, వినిమయం జరిగింది గనుక, ఎక్సైజు పన్నుల ఆదాయం పెరిగిందని ఒకవేళ అంటే అది వాస్తవంకాదు.

పదేళ్ళలో ఎక్సైజు పన్నులు 347 శాతం పెరిగాయి. కాని సరకుల వినిమయం 50 శాతం కూడా పెరిగిందని చెప్ప లేము. వస్త్రాలు 1948 లో తలఒక్కంటికి 11½ గజాలు, 1951 లో 8.9 గజాలు లభ్యమైతే 1959 లో మళ్ళీ 11 గజాల వద్దనే నిలిచిపోయింది. పంచదార వాడకం 1948 లో 7½ పౌను లుంటే, 1951 లో 6.7 పౌనులకు తగ్గింది. 1959 నాటికి 10¾ పౌనులకు హెచ్చింది.

(తృణధాన్యాల వినిమయం 1951 లో 296.6 పౌను లుంటే 1959 నాటికి 367.3 పౌనులుంది.)

దీనినిబట్టి ఎక్సైజు పన్నులు పెరుగుదల, సరుకు విని మయం పెరుగుదలవలన కాదనీ, పన్నులువేసిన సరకులసంఖ్య విస్తృతంగాకావడమో లేక పన్నులరేటు హెచ్చుకావడమో కారణమనీ స్పష్టం.

ఎక్సైజు పన్ను విధించే సరకు సంఖ్య రెట్టింపు పెరిగా యనుకున్నప్పటికీ అత్యధికభాగం రెవెన్యూ, పన్నుల రేటు ఎక్కువ చేయడంవలననే ప్రభుత్వం రాబడుతోందని తేలు తూంది.

కేంద్ర ప్రభుత్వ ఎక్సైజు పన్నులు (కోట్ల రూపాయలలో)

| | 1950—51 | 1955—56 | 1959—60 |
|---|---|---|---|
| | కో. ల. | కో. ల. | కో. ల. |
| కిరసనాయిలు | 3 - 28 | 2 - 43 | 6 - 35 |
| పంచదార | 6 - 46 | 18 - 58 | 46 - 40 |
| అగ్గి పెట్టెలు | 8 - 7 | 10 - 08 | 18 - 60 |
| టైర్లు, ట్యూబ్‌లు | 4 - 7 | 5 - 53 | 10 - 50 |
| వెజిటబుల్ ప్రొడక్ట్స్ | 2 - 19 | 3 - 82 | 5 - 60 |
| వస్త్రాలు | 9 - 26 | 28 - 18 | 43 - 00 |
| సిమెంటు | — | 2 - 22 | 16 - 50 |
| పాదరక్షలు | — | 0 - 84 | 1 - 10 |
| సబ్బు | — | 1 - 55 | 2 - 00 |
| ఎలక్ట్రిక్ బల్బులు | — | 0 - 25 | 0 - 33 |
| కాగితం | — | 2 - 68 | 7 - 50 |
| వనస్పతి | — | 0 - 29 | 13 - 09 |
| శుద్ధిపరచిన డీసెల్ నూనె | — | 0 - 16 | 24 - 00 |
| పొగాకు | 31 - 99 | 36 - 46 | 43 - 74 |
| తేయాకు | 3 - 36 | 3 - 17 | 7 - 65 |

అదనపు ఎక్సైజు పన్నులు

| | | | |
|---|---|---|---|
| పంచదార | — | — | 12 - 90 |
| వస్త్రాలు | — | — | 20 - 49 |
| పొగాకు | — | — | 7 - 30 |

## పరోక్ష పన్నుల ఫలితాలు

పరోక్షపన్నులు ప్రజల జీవనవ్యయం పెరగడానికి ఏవిధంగా దారి తీస్తున్నాయో చూద్దాం. 1955-56 లో రిఫైన్డ్ డీసెల్ నూనెమీద, వేపరైజింగ్ నూనెలమీద ఎక్సైజుపన్ను

16 లక్షలు, 1959-60 నాటికి 24 కోట్లయింది. 1958-59 లో యీ నూనెలపై పన్ను 9 కోట్ల 60 లక్షలు. అంటే ఒక్క ఏడాదిలో 15 కోట్ల పన్ను పెరిగిందన్నమాట.

అలాగే పంచదారపై అదనపు ఎక్సైజు పన్ను 1958 - 59 లో 6 కోట్ల 79 లక్షలుంటే ఒక ఏడాదిలో రు. 12 కోట్ల 90 లక్షలకు పన్ను పెరిగిపోయింది. బట్టలపై రు. 15 కోట్ల 27 లక్షలు, పొగాకుపై రు. 3 కోట్ల 19 లక్షలు అదనపు ఎక్సైజు పన్నులు పడ్డాయి.

ఈ పన్నులన్నీ పడటంవలననే ఒక ఏడాదిలో పంచదార, బట్టలు మొదలైన సరుకుల ధరలు ఇంత పెరిగిపోయాయి. డీసెల్ నూనె రేట్లు పెరిగినందున బస్, లారీల రేట్లు పెరిగి పోయాయి.

## రాష్ట్రాల్లో పన్నులు

కేంద్రం విధించిన ఈ పన్నులతో బాటు రాష్ట్ర ప్రభుత్వాలద్వారా ప్రజలమీద పడే పరోక్ష పన్నులలో అమ్మకం పన్ను ప్రధానమైనది. రాష్ట్ర ప్రభుత్వాలు విధించే పన్నులలో భూమిపన్ను ప్రధానమైనదికాగా, ఆ తర్వాత వచ్చేది అమ్మకం పన్ను. ఇది కొనుగోలుదార్లపై మోయరాని బరువును ఎత్తడమేగాక చిన్నవర్తకుల కంఠాలకు ఉరితాళ్ళవలె పరిణమించింది. అమ్మకం పన్ను వసూలులో అనేక అవకతవకలు, అన్యాయాలకు ఈ చిన్న వర్తకులు గురి అవుతున్నారు. ఈ అమ్మకం పన్నువలన నిత్య జీవితావసర వస్తువుల ధరలు

మరింత పెరుగుతున్నాయి. ద్వితీయ ప్రణాళికా కాలంలో రాష్ట్రాలు అదనంగా వేసే రు. 225 కోట్ల పన్నుల్లో సగానికిసగం అమ్మకం పన్ను ద్వారానే లభించుతూంది. అంటే ఈ మేరకు ప్రజలు తమ జీవితావసర వస్తువులను ఎక్కువ ధరలుపెట్టి కొంటున్నారు.

ప్రజలపై ఒకవైపున ఈవిధంగా పన్నులభారం పెరిగితే పెట్టుబడిదారులపైపడే ప్రత్యక్షపన్నులు తగ్గించబడినాయి.

## ప్రత్యక్ష పన్నుల తగ్గింపు

కంపెనీల లాభాలపై పన్నులు తగ్గించబడినాయి. కొన్ని రకాల కార్పొరేషన్ పన్నులు చూడండి.

1950_51 లో కంపెనీలపై అదనపు లాభాల పన్ను 3 కోట్ల 81 లక్షలుంటే 1955_56నాటికి 73 లక్షలకు, 1959_60 నాటికి 70 లక్షలకు తగ్గించబడింది.

### కంపెనీలపై పన్నులు

| | 1950—51 | 1955—56 | 1959—60 |
|---|---|---|---|
| | కో. ల. | కో. ల. | కో. ల. |
| సర్చార్జి | — | 0 – 3 | — |
| అదనపు లాభాలపన్ను | 3 – 18 | 0 – 73 | 0 – 59 |
| వ్యాపార లాభాలపన్ను | 2 – 42 | 5 లక్షలు నష్టం | 0 – 5 |
| **కంపెనీలపై పన్నులు మినహా మిగిలిన ఆదాయపు పన్నులు** | | | |
| సర్చార్జి | 2 – 35 | 4 – 90 | 9 – 00 |
| అదనపు లాభాల పన్ను | 2 – 49 | 0 – 80 | 0 – 25 |
| వ్యాపార లాభాల పన్ను | 0 – 76 | 0 – 22 | 0 – 5 |

1958-60 బడ్జెట్‌లో శ్రీ మొరార్జీ దేశాయి ఆదాయ పన్ను రేటు 30 శాతం నుండి 20 శాతానికి తగ్గించారు. 1.5 శాతం సర్చార్జి రద్దుచేశారు. సూపర్ టాక్సును 20 శాతం నుండి 25 శాతానికి (పన్నుల విధానాన్ని సౌలభ్యంచేసే పేరుతో) పెంచారు. ఇందువలన 51.6 శాతం బదులు 45 శాతం ఆదాయపుపన్ను మాత్రమే పడింది.

ఈవిధంగా పన్నుల రేట్లు తగ్గించడం వలన కంపెనీలపై పన్నులభారం యేవిధంగా తగ్గిపోయిందో చూద్దాం.

ప్రత్యక్ష పన్నుల తగ్గింపు

| | 1957-58 | 1959-60 |
|---|---|---|
| | లక్షలు | లక్షలు |
| తేయాకు | 212 | 158 |
| రబ్బరు | 35 | 31 |
| బొగ్గు | 148 | 113 |
| ఆహారధాన్యాలు | | |
| పప్పులు | 72 | 56 |
| వనస్పతి | 20 | 1 |
| పంచదార | 388 | 343 |
| పొగాకు | 244 | 178 |
| వస్త్రాలు | 644 | 211 |
| విద్యుచ్ఛక్తి సామగ్రి | 117 | 96 |
| మందులు | 31 | 27 |
| అగ్గిపెట్టెలు | 50 | 29 |
| వర్తకం | 158 | 111 |

శ్రీ మొరార్జీ దేశాయి ఈ విధంగా దాదాపు 10 కోట్ల రూపాయలు పెట్టుబడిదారులకు పన్నులు తగ్గించినట్లు అంచనా. కాకుల్నికొట్టి గద్దలకు వేసే పన్నుల విధానం శ్రీ మొరార్జీ దేశాయి నాయకత్వాన ఈ విధంగా సాగింది. దాని దుష్ఫలితమే నేటి అధికధరలు. ఇదిలా ఉండగా ఎస్టేటు పన్నుల ఎగవేతద్వారా రెండు మూడు వందలకోట్ల రూపాయలవరకు పెట్టుబడిదారులు లాభపడుతున్నట్లు మన పన్నుల విధానాన్ని పరిశీలించిన బ్రిటిష్ ఆర్థికవేత్త ప్రొఫెసర్ కాల్డార్ విచారణ నివేదికనుబట్టి తెలుస్తుంది.

# హద్దులేని ఋణగ్రస్త ద్రవ్యవిధానం

ఉత్పత్తి పెంచడానికి కాకుండా, చట్టా వ్యాపారానికి, అధిక లాభార్జనకు షెడ్యూల్డు బ్యాంకులు అతిధారాళంగా అప్పులు ఇవ్వడంవలనా, పరోక్ష పన్నులను ప్రభుత్వం విపరీతంగా హెచ్చించడంవలనా ప్రజల నిత్యజీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోయిన విషయం చూశాం. దీనికి ప్రభుత్వం అవలంబించిన హద్దూపద్దూలేని ఋణగ్రస్త ద్రవ్య విధానమూ, అందువలన ఏర్పడిన అంతులేని ద్రవ్యోల్బణం (నోట్లముమ్మరం) ఏవిధంగా దోహదం చేశాయో చూదాం.

ప్రథమ ప్రణాళికా వనరులను సేకరించడంలో ఏర్పడిన లోటును భర్తీ చేయడానికి రు 290 కోట్ల మేరకు ఋణగ్రస్త ద్రవ్య విధానాన్ని అవలంబించాలని ప్రణాళిక సంఘం నిర్ణ

యించింది. కాని యిది దాదాపు రు 390 కోట్ల వరకు పెరిగి పోయింది.

అదేవిధంగా రెండవ ప్రణాళిక కాలంలో రు. 800కోట్లు మించకుండా రుణగ్రస్త ద్రవ్యవిధానాన్ని అవలంబించాలని, అంతకు మించడం ఏ మాత్రం క్షేమకరం కాదని ఆర్థికవేత్తల ఉపసంఘంవారు ద్వితీయ ప్రణాళిక వనరుల సమస్యపై ప్రణాళికసంఘానికి మెమొరాండం సమర్పించారు. కాని ప్రణాళిక సంఘంవారు రు. 1200 కోట్ల మేరకు రుణగ్రస్త ద్రవ్య విధానాన్ని అవలంబించాలని నిర్ణయించారు. కాని ఆచరణలోకి వచ్చేసరికి ప్రభుత్వం ఈ హద్దునుకూడా ఏమీ పాటించలేదు.

1956–57 లో రు. 238 కోట్లు, 1957–58లో రు. 464 కోట్లు, 1958–59 లో రు. 255 కోట్లు రుణగ్రస్త ద్రవ్యాన్ని వినియోగించారు. అంటే ద్వితీయ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలోనే 957 కోట్లు అదనపు ద్రవ్యం చెలామణిలోకి వచ్చింది. 1959–60 లో 245 కోట్లు రుణగ్రస్త ద్రవ్య విధానాన్ని అవలంబించటంతో ప్రణాళిక నాల్గవ ఏటనే దాదాపు అనుకున్న పరిమితి చేరిపోవడం జరిగింది. ప్రస్తుత సమాచారాన్ని బట్టి ద్వితీయ ప్రణాళిక మొత్తంమీద అనుకున్నదానికి మరి 200 కోట్లు యెక్కువగానే రుణగ్రస్త ద్రవ్యం వినియోగించనున్నట్లు అంచనా.

1952–60 సంవత్సరాలమధ్య అటు ప్రభుత్వమూ, యిటు బ్యాంకులూ కలిసి షుమారు 2700 కోట్ల రూపాయల మేరకు అధిక చలామణిని తీసుకొని వచ్చినట్లు రిజర్వు బ్యాంకు లెక్కలే చెబుతున్నాయి.

ద్రవ్య చలామణి (కోట్ల రూపాయలలో)

| సం॥ | కరెన్సీనోట్లు కో॥ ల. | బ్యాంకుల ద్రవ్య చలామణి | మొత్తం ద్రవ్య చలామణి |
|---|---|---|---|
| 1952 - 53 | 1199.25 | 565.46 | 1764.71 |
| 1953 - 54 | 1229.43 | 564.54 | 1793.97 |
| 1954 - 55 | 1311.77 | 608.86 | 1920.63 |
| 1955 - 56 | 1505.09 | 679.23 | 2184.32 |
| 1956 - 57 | 1556.50 | 756.39 | 2312.89 |
| 1957 - 58 | 1606.60 | 782.22 | 2388.83 |
| 1958 - 59 | 1724 53 | 774.23 | 2498.75 |
| 1959 - 60 | 1887.96 | 840.45 | 2698.41 |

— (రిజర్వు బ్యాంకు బులెటెన్)

1960 మార్చి నెలలో బ్యాంకుల ద్రవ్య చలామణీ 1127 కోట్లకు, దేశంలో మొత్తం ద్రవ్య చలామణీ 2776 కోట్లకు పెరిగినట్లు ఏప్రిల్ రిజర్వు బ్యాంకు బులిటెన్‌లో తెలియజేశారు.

## ఋణగ్రస్త ద్రవ్యవిధానం అవలంబించడం సరియైనదేనా?

ప్రభుత్వం తన చేతులలో డబ్బు కొరత ఏర్పడినపుడు, తన ఖర్చుకు తగినఆదాయంలేనపుడు కొంత అదనపుద్రవ్యాన్ని చెలామణిలోకి తీసుకొనివస్తుంది. దీనినే ఋణగ్రస్త ద్రవ్యవిధానం అని అంటున్నారు. ప్రభుత్వం తన హామీతో రిజర్వుబ్యాంకు ద్వారా అదనపు ద్రవ్యాన్ని చెలామణీలో పెట్టిస్తుంది. ట్రెజరీ బిల్లుల అమ్మకంద్వారాను, నగదునిల్వలను వాడటంద్వారాను విదేశీ ద్రవ్యాన్ని (స్టెర్లింగ్ నిల్వలను) వాడటం ద్వారాను ఈ

అదనపు ద్రవ్యాన్ని సృష్టించవచ్చు. ఇందువలన యిదివరకు చెలామణీలోవున్న డబ్బులో యిదికూడా కలుస్తుంది.

ఈ అదనపు ద్రవ్యం ఉత్పాదక కార్యక్రమాలకే విని యోగించబడినట్లయితే సరుకుల ఉత్పత్తి ఎక్కువై డిమాండు సప్లయి సూత్రాల్ని అనుసరించి ధరలు మితిమిక్కిలి పెరిగే అవకాశం ఉండదు. దేశంలో ఉత్పత్తికీ, అదనంగా చెలామణిలోకి వచ్చిన ద్రవ్యానికీ సమతూకం లేకపోతే డబ్బు ఎక్కువ, సరకులు తక్కువా అవడంవలన ధరలు పెరిగిపోయే ప్రమాదం ఏర్పడుతుంది. అందుచేత రుణగ్రస్త ద్రవ్యవిధానం అవలంబించే టప్పుడు చాల జాగ్రత్త తీసుకోవలసిన అవసరం ఉన్నది. అంటే, ఉత్పత్తి పరిమాణం అదనపు ద్రవ్యపరిమాణం ఇంచు మించు సమాన స్థాయిలో ఉండేటట్టు చూడాలి. ఒకవేళ అంచనాల మేరకు ఉత్పత్తులు పెరగవనుకున్నప్పుడు అధిక ద్రవ్యాన్ని చలామణిలో లేకుండా ఉపసంహరించే చర్యలు తీసుకోవాలి.

అంటే ప్రభుత్వం తిరిగి ఈ అదనపుద్రవ్యాన్ని రుణ సేకరణద్వారానో, పన్నుల రూపంలోనో రాబట్టుకోవాలి.

## పెట్టుబడిదారీ ఆర్థిక సూత్రం

సోషలిస్టు దేశాలలోవలె ఉత్పత్తి సాధనాలను ప్రభుత్వ పరం చేసుకొని పెట్టుబడిదారీ ఆర్థిక విధానానికి మూలసూత్ర మైన లాభాపేక్షతో నిమిత్తం లేకుండా, ఉత్పత్తి వినిమయం సమాజపరంగానే జరిగినప్పుడు ఇటువంటి పెట్టుబడిదారీ ఆర్థిక సూత్రానికి, అనగా రుణగ్రస్త ద్రవ్య విధానానికి తావే లేదు.

అందువలన ఆ విధంగా ధరలు పెరిగే సమస్యే లేదు. సోషలిస్టు దేశాలలో కూడా అధిక ధరలు ఉండవచ్చు. కాని ఆ పెరుగుదల డిమాండు సప్లయి సూత్రాన్ని అనుసరించి జరగదు. ధరల పెరుగుదలకూ ఉత్పత్తికీ ప్రత్యక్ష సంబంధం ఉండదు. సోషలిస్టు దేశాలలో ప్రతి సంవత్సరం తయారయ్యే వస్తు సముదాయాన్ని అనుసరించి ధరలు, వేతనాలు నిర్ణయించుతున్నారు. పెట్టుబడి దారీ దేశాలలో ఆ విధంగా కాక యజమానుల లాభాపేక్ష ఉత్పత్తిని, ధరలను వేతనాలను నిర్ణయిస్తుంది. పెట్టుబడిదారులకు అధికలాభాలు తీయడమే పరమావధి. సరకుల ఉత్పత్తివలన అదనపు విలువ సృష్టించబడినప్పుడు అందులో అధికభాగం యజమాని కాజేసినప్పుడు కార్మికులకు తక్కువభాగం రాక ఏమౌతుంది? ప్రజలకు సరకులు ఎక్కువ ధరకు గిట్టుబాటు కాక ఏమౌతుంది?

అందుచేత అదనపు ద్రవ్య చలామణీ వలన పెట్టుబడి దారీ సమాజంలో అదనపు ఉత్పత్తి జరిగినప్పటికీ, ఆ ఉత్పత్తి ఫలితం ప్రజలకు కాక పెట్టుబడిదారులకే పోతుంది. ఆదాయాలు పెట్టుబడిదారులకే ఎక్కువ అవుతాయి.

## హద్దులేని ఋణగ్రస్త ద్రవ్యం

సోషలిస్టు సమాజవిధానం తమ ధ్యేయమనీ, ఆర్థిక వ్యత్యాసాలను తగ్గించడం ప్రణాళికల ప్రధాన లక్ష్యమనీ నెహ్రూ ప్రభుత్వం ఒక వైపున చెబుతున్నప్పటికీ ప్రణాళిక వనరుల సేకరణ సమస్యవచ్చేసరికి పెట్టుబడిదారీవర్గ లాభాలకు పరిమితులు ఏర్పరచడంగాని, ఆదాయాల సమపంపకం

గాని, అవలంబించడం లేదు. పెట్టుబడిదారీ ఆర్థిక సూత్రాలనే అవలంబించుతున్నది.

(ఆర్థిక మాంద్యంవచ్చి ధరలు పడిపోయినప్పుడు అమెరికావంటి పెట్టుబడిదారీ దేశాలు నోట్ల ముమ్మరం ద్వారా ఆ సంక్షోభాన్ని దాటుతున్నాయి. బ్రిటిష్ ప్రభుత్వం యుద్ధకాలంలో భారతదేశంలో అధిక చలామణి ద్వారా యుద్ధ అవసరాలను తీర్చుకొని బెంగాల్ క్షామాన్ని సృష్టించింది)

ప్రజల జీవన ప్రమాణాలతో చెలగాటమాడే యిటువంటి విపత్కరమైన ద్రవ్యనీతిని కేంద్ర ప్రభుత్వం అవలంబించటానికి సంసిద్ధమైనప్పుడు దేశంలోని ప్రముఖ ఆర్థికవేత్తలు, ప్రజా ప్రతినిధులు ఎన్నో హెచ్చరికలు చేశారు. ఋణగ్రస్త ద్రవ్య విధానాన్ని తగు హద్దులలో ఉంచాలనీ, యిందువలన వచ్చిన అదనపు చెలామణీని పరిహరించడానికి ఎప్పటికప్పుడు తగు చర్యలను తీసుకోవాలనీ వీరు సూచించారు.

1956 లో లోక్‌సభలోని కమ్యూనిస్టు ప్రతినిధులు ఋణగ్రస్త ద్రవ్యవిధానం వలన వచ్చే చెడుగులను పరిహరించడానికి చేసిన సూచనలు ఇవి: (1) కంపెనీల వాటాలపై పంచి పెట్టే డివిడెండ్లను తగ్గించాలి. (2) అదనపు లాభాల పన్నును హెచ్చించాలి. (3) మరణ సుంకాన్ని హెచ్చించాలి. (4) వ్యక్తి ఆదాయాలకు పరిమితి విధించాలి. (5) వ్యవసాయాదాయాలపై పన్ను విధించాలి. (6) ప్రభుత్వ వ్యాపార పథకాన్ని అమలు జరపాలి.

ఈ చర్యలు తీసుకుంటే అధిక చలామణీ వలన ధనిక వర్గాల చేతుల్లోకివచ్చిన అదనపు సొమ్మును పన్నులరూపంలో

ప్రభుత్వం రాబట్టడం సాధ్యమయ్యేది. కాని రెండు ప్రణాళిక కాలాల్లో ప్రభుత్వం యీ సూచనలన్నింటికి విరుద్ధమైన విధానాలను అవలంబించింది.

పెట్టుబడిదారులపైబడే ప్రత్యక్ష పన్ను లన్నింటిని తగ్గించి వేసింది.

(1947-48 లో 42 శాతం వుండే ఎక్సైజు పన్నులు 1954-55 కు 64 శాతానికి పెరిగితే, 1947-48 లో 64 శాతం వుండే ఆదాయపు పన్నులు 30 శాతానికి తగ్గిపోయాయి.)

పోనీ అధిక లాభాలపై పన్నులు విధించి ఆవిధంగానైనా పెట్టుబడిదారుల చేతుల్లోకి పోయిన అదనపు ద్రవ్యాన్ని రాబట్టిందా ? అంటే అదీ లేదు. పెట్టుబడిదారుల లాభాలు అపరిమితంగా పెరిగిపోనిచ్చింది. (1939 లో లాభాల సూచీ సంఖ్య 100 వుంటే 1956 నాటికి పంచదార పరిశ్రమలో 454.5 కు సిమెంటు పరిశ్రమలో 430.2 కు పత్తి 568.4 కు లాభాలు పెరిగాయి.)

ఇక వ్యక్తిగత ఆదాయాలకు పరిమితులూ పెట్టలేదు. వ్యవసాయాదాయపు పన్ను విధించాలేదు. ఆహారధాన్యాలు మొదలైన నిత్యజీవితావసరాలలో దళారీలకు స్థానం లేకుండా ప్రభుత్వ వ్యాపార పథకాన్ని అమలు జేయలేదు.

ఋణగ్రస్త ద్రవ్య విధానాన్ని అవలంబించినపుడు యేర్పడే దుష్ఫలితాలను పరిహరించడానికి, అంటే ఆ భారం యావత్తు ప్రజలపై పడకుండా చేయడానికి ప్రభుత్వం యెట్టి చర్యలూ తీసుకోలేదు. పైపెచ్చు ఆర్థిక వేత్తలు పెట్టిన హద్దులనుకూడా దాటిపోయింది. రెండు ప్రణాళికలకాలంలోనూ

దాదాపు 1270 కోట్ల రూపాయల రుణగ్రస్త ద్రవ్యాన్ని ప్రభుత్వం చెలామణిలో పెట్టింది.

## అంతులేని ద్రవ్యోల్బణం

ఇంతకుముందు చెప్పినట్లుగా ఉత్పత్తి అయ్యే సరకుల మొత్తం విలువకూ, చలామణిలో ఉన్న ద్రవ్యానికి ఉండవలసిన కనీస నిష్పత్తి దాటిపోయినప్పుడు రుణగ్రస్త ద్రవ్యాన్ని ఇక అవలంబించకూడదు. ఈ నిష్పత్తిని ఎలా నిర్ణయించాలి? సుప్రసిద్ధ ఆర్థికవేత్త డాక్టర్. వి. కె. ఆర్. వి. రావు ఇలా అంటున్నారు:

"ఒక నిర్ణీతదశలో జాతీయ ఉత్పత్తి విలువకంటె జాతీయ పెట్టుబడి యే మేరకు ఎక్కువ ఉంటుందో ఆ మేరకు ప్రభుత్వం పెట్టుబడి పెడితే దానినే ఋణగ్రస్త ద్రవ్యమని చెప్పవచ్చు. అదనంగా పెట్టిన ప్రభుత్వం పెట్టుబడి, ధరల పెరుగుదలరూపం ధరించుతుంది. మరోమాటలో చెప్పాలంటే ధరల పెరుగుదల వలన నిర్బంధంగా పొదుపుచేయబడిన మొత్తమే రుణగ్రస్త ద్రవ్యమని చెప్పవచ్చు."

ఈ నిర్వచనం ఇచ్చిన తర్వాత శ్రీ వి. కె. ఆర్. వి. రావు ఇంకా ఇలా అంటున్నారు:

"ఆర్థికాభివృద్ధి క్రమంలో రుణగ్రస్త ద్రవ్యవిధానం పాత్రను ఇప్పుడు త్రోసివేసి ఫలితంలేదు. అయితే దీనిని ఏ మేరకు సాగించవచ్చునన్నదే ప్రశ్న. దానికి ఒకటే సమా

ధానం: ఋణగ్రస్త ద్రవ్యవిధానం ద్రవ్యోల్బణంగా మారకుండా ఉన్నంతవరకూ సాగించవచ్చు. ఋణగ్రస్త ద్రవ్యవిధానంవలన ధరలు కొంతవరకు పెరగవచ్చు. అంతమాత్రాన అది ద్రవ్యోల్బణ రూపం ధరించదు. ధరల పెరుగుదల మరింతధరల పెరుగుదలకు — ఆ పెరుగుదల మళ్లీ పెరుగుదలకు ఒక విషమచక్రంగా ఏర్పడినప్పుడే ఋణగ్రస్త ద్రవ్య విధానం ద్రవ్యోల్బణ స్థితికి దిగజారిపోయిందని చెప్పవచ్చు ... యీ ద్రవ్యోల్బణ స్థితిలో కరెన్సీ (నోట్ల ముద్రణం) అదేపనిగా పెరిగిపోతూ ఉంటుంది. ఋణగ్రస్త ద్రవ్యవిధానం ద్రవ్యోల్బణ స్థితికి దిగజారిపోయినప్పుడు అది పెట్టుబడి సేకరణకు దారితీయదు. అర్థికాభివృద్ధికి దోహదం చేయదు.”

(బడుగు దేశాలలో ఋణగ్రస్త ద్రవ్యవిధానం—పెట్టుబడి సేకరణ — ధరలు అన్న శ్రీ రావు గ్రంథ నుండి.)

ద్వితీయ ప్రణాళిక ఆరంభమయ్యేసరికి (1956) దేశంలో ఎంత ద్రవ్యం చెలామణీలో వుందో ఇంచుమించు అంత ద్రవ్యమూ అదనంగా (1200 కోట్లు) చెలామణీలోకి తీసుకురావడానికి నిర్ణయించడమూ, మొదటి నాలుగేళ్ళలోనే ఆ పరిమితికూడా పూర్తి చేసి వేయడమూ చూస్తే, ప్రభుత్వం హద్దుమీరి, అతి నిర్లక్ష్యంగానూ, అజాగ్రత్తగానూ వ్యవహరించిందని వేరే చెప్పాలా? డాక్టర్ వి. కె. ఆర్. రావు హెచ్చరించినట్లు జాతీయ ఉత్పత్తి ప్రమాణం, ఋణగ్రస్త ద్రవ్యం ఒకదానికొకటి పొత్తు లేకుండా పోయింది. ఋణగ్రస్త ద్రవ్యం నిస్సంశయంగా ద్రవ్యోల్బణ రూపాన్ని దాల్చింది. ఈవిధంగా జరగడానికి మరో ముఖ్యమైన అంశంకూడా తోడ్పడింది. అదే బ్యాంకులు

అమలులో పెట్టిన అదనపు ద్రవ్యచలామణి. ప్రైవేటు యాజమాన్యానవున్న బ్యాంకులు 1952-'53 నుండి 1959-'60లోగా 1127 కోట్ల రూపాయలు చెలామణీలో పెట్టాయి. ఉత్పాదక కార్యక్రమాలకు గాకుండా, చట్టా వ్యాపారానికి యీ ద్రవ్యంలో ఎక్కువ భాగం వినియోగించబడింది. ఇదంతా ద్రవ్యోల్బణ పరిస్థితిని మరింతగా తెచ్చిపెట్టింది.

## శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ హెచ్చరిక ఏమైనట్లు?

1956 మార్చిలో అప్పటి ఆర్థికమంత్రి శ్రీ చింతామణి దేశ్‌ముఖ్ రు. 390 కోట్ల మేరకు లోటుబడ్జెట్ ప్రవేశపెడుతూ యిది విపత్కరమైన విధానమేనని అంగీకరించారు. ఆయన యిలా అన్నారు:

"రుణగ్రస్త ద్రవ్యవిధానం విపత్తుతో కూడినదే. ద్రవ్యోల్బణం ప్రారంభ దశ సుళువుగానే వుండవచ్చు. కాని యిది యేటితలుపులు యెత్తడం లాంటిది. ఏటితలుపులు ఒకసారి తెరుచుకున్న తరువాత, ఇక మూయడం మాత్రం అసాధ్యం."

శ్రీ దేశ్‌ముఖ్ అదే పార్లమెంటు సమావేశంలో 1956 మార్చి 16న ధరలగురించి మాట్లాడుతూ యిలా అన్నారు:

"ప్రాథమిక జీవితావసర వస్తువుల ధరలు విపరీతంగా పెరిగిపోకుండా చూడటం ముఖ్యమైన విషయం. ఎందుకంటే జీవితావసరాల ధరలు పెరిగితే, అక్కడనుండి అన్ని ఖర్చులు పెరిగిపోవడం, అందువలన అన్ని ధరలు పెరిగిపోవడం, సంభవించుతుంది."

శ్రీ దేశ్‌ముఖ్ నుండి శ్రీ మొరార్జీ దేశాయ్ వరకు 1956 నుండి 1960 వరకు ఒకటే పాట...ఒకటే హామీ... "ధరలు పెరగకూడదు. పెరగడం మంచిదికాదు. పెరగకుండా చూస్తాం, తగ్గుతాయని ఆశిస్తాం" అని !

ముంద్రా కుంభకోణంలో "ఆహుతి" అయిన శ్రీమాన్ టి. టి. కృష్ణమాచారి 1957 లో ఆర్థిక మంత్రిగా బడ్జెట్ ప్రసంగం చేస్తూ చెప్పిన మాటలుకూడా అదే ధోరణిలోనే నడిచాయి. "ఎక్సైజు పన్నులు, దిగుమతి పన్నులు సప్లయి - కిమాండుల మధ్య సమతూకాన్ని సరిచేయడానికి అవసరం. ఈ సమతూకం భగ్నం కాకుండా చేయడానికి, ద్రవ్యోల్బణ వొత్తిడి అరికట్టడానికి యీ పన్నులు అవసరం."

ద్రవ్యోల్బణ వత్తిడి అరికట్టాలన్న సదాశయమే శ్రీకృష్ణమాచారి కూడా అప్పుడు వెలిబుచ్చారు.

ఇప్పుడు ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీభాయి కూడా ఆ మాటనే మళ్ళీ మనకు చెబుతున్నారు. జూలై 9వ తేదీన ఆయన బొంబాయిలో మాట్లాడుతూ "ధరలను అదుపులో పెట్టాలని చెప్పడానికి హేమాహేమీలెవరూ అవసరంలేదు. ధరలను అదుపులో పెట్టాలన్నమాట నిజమే. తృతీయప్రణాకలోనైనా ధరలను అదుపులోకి తేగలమని ఆశిస్తున్నాను" అని సెలవిచ్చారు. గోడమీద "రేపు" అని వ్రాసి ప్రతిరోజూ చూచుకోమన్నట్లుగా ఉంది మన ఆర్థికమంత్రుల హామీ! మొదటి ప్రణాళిక గడిచింది. రెండవ ప్రణాళిక ఆఖరు సంవత్సరం గడుస్తున్నది. ఇంతవరకు ధరలు అదుపులోకి తేలేదు. ఇక తృతీయ ప్రణాళికలో ధరలుతగ్గుతాయని ఆశించమంటున్నారు,

శ్రీ దేశాయిగారు. కాని యీ లోగా ఉద్యోగులు, కార్మికులు ఆందోళన చేస్తేమాత్రం శ్రీ దేశాయి వూరుకోరు ! అగ్నినెన్నులు తెరుస్తారు !

## ఆచరణలో పూజ్యమైన హామీలు

శ్రీ దేశాయిగారు మరో విలువైన మాటకూడా సెల విచ్చారు. "అభివృద్ధి పొందుతున్న ఆర్థిక వ్యవస్థలో ఆదాయాలు పెరుగుతున్నాయి. అదే సమయంలో అందు కనుగుణ్యంగా ఉత్పత్తి పెరగడంలేదు." అని శ్రీ మొరార్జీభాయి చెప్పే ఆదాయాలు యెవరివి ? కార్మికులు, మధ్యతరగతులు, కష్టించి పనిచేసే అశేష జనసామాన్యానివా ? అందుకు వారి సన్నిహిత మిత్రులయిన బిర్లాగారి పత్రిక ఈస్టరన్ ఇకానమిస్టు విరుద్ధమైన సాక్ష్యమిస్తూంది. 1960 బడ్జెట్టు సంచికలో "దిగజారిన మధ్యతర గతుల జీవనపరిస్థితి" అన్న వ్యాసంలో స్థిర ఆదాయాలు, వేత నాలు గల ప్రభుత్వోద్యోగులు, యితర మధ్యతరగతుల నిజ ఆదాయాలు పడిపోయాయని, అందుచేత వారిలో అసంతృప్తి పెల్లుబుకుతున్నదన్న విషయం లోగడ చూశాం.

శ్రీ మొరార్జీ దేశాయిగారు ప్రజల ఆదాయాలు పెరిగి పోయినట్లు చిత్రించి, అంతటితో సరిపెడితే, వారిని సమర్థించ బూనుకున్నవారు ప్రజలలో ఏదో త్యాగభావం కొరవడు తున్నట్లు, అందుచేత అధికధరల వలన బాధలు సహించవల సిందేనంటూ హితబోధ చేస్తున్నారు.

విజయవాడ తెలుగు దినపత్రిక "ఆంధ్రజ్యోతి" 1960, జూలై 26 వ తేదీ సంపాదకీయంలో ఈ విధంగా వ్రాసింది :

"అనివార్యమైన ధరల పెరుగుదల తెచ్చే చిక్కులసన్ని కొంత ఓర్పుని అన్నివర్గాలవారు చూపాలి. ఇది నిమ్మకు నీరెత్తి నట్లుగా కూర్చున్నవారు చెప్పేమాట అని కొట్టివేయడం సులువే. కాని రేపటికోసం, ముందు తరాలవారికోసం ఎవో కొన్ని కష్టాలను భరించనిజాతి, ఎంతో కొంత త్యాగాన్ని చేయని ప్రజ ఏది ముందుకు వచ్చింది?"

"అనివార్యమైన" ధరల పెరుగుదలవల్ల రెండు ప్రణాళికా కాలాల్లో కోట్లకొలదీ లాభాలు గడించిన పంచదార ప్రభువులూ, సిమెంటు ప్రభువులూ, బట్టలమిల్లు ప్రభువులూ, తదితర ప్రభువులూ మినహా మిగిలిన అన్నివర్గాలవారు..."అని ఇందులో చేర్చి చదువుకుంటే చాలు!

వాస్తవానికి కొంచెం దగ్గర పడినట్లు అవుతుంది. ఈ ఆత్మవంచనతో కూడుకొన్న హితవుకు సమాధానం మళ్ళీ ఎవరో యివ్వవసరం లేకుండానే, అదే పత్రిక అంతకు ముందు జూలై 17 వ తేదీన ప్రకటించిన ఒక వ్యాసంలో ఇలాఉంది:

మన దేశంలో ధరలువిపరీతంగా పెరిగిపోయినవి. ఇంకా పెరుగుతూనే ఉన్నవి. ఆర్థికాభివృద్ధి దీని కంతటికీ కారణం అనుకుంటే మాత్రం ఆత్మవంచనే అవుతుంది.

"ప్రతి దేశంలోనూ విపరీత లాభార్జనా తృష్ణపరులైన వ్యాపారులు, చట్టా వ్యాపారులు వుండనే వుంటారు. - వారి మూలానే ధరలు హద్దు మీరుతుంటాయి ... ధరల పెరుగుదలకు ద్రవ్యోల్బణం కూడా చాలవరకూ దోహదమిస్తున్నది. ఋణగ్రస్త ద్రవ్య నీతిని మితిమీరిన రీతిలో అమలు జరపడం వలన వచ్చిపడిన అనర్థకాలు అనేకం."

# ఆహారధాన్యాల ప్రభుత్వ వ్యాపార పథకం ఏమైంది?

అటు ఉత్పత్తిదారునికీ, ఇటు కొనుగోలుదారుకూ మధ్య నున్న దళారులను తొలగించనిదే ధరల స్థిరీకరణ సాధ్యంకాదనీ, ధరల స్థిరీకరణకు ఒక ప్రధాన కార్యక్రమంగా ఆహారధాన్యాల వ్యాపారాన్ని ప్రభుత్వమే కొనసాగించాలని ప్రణాళికాసంఘం, జాతీయాభివృద్ధి సమితి నిర్ణయించాయి. కాని, ఆచరణలో జరిగిందేమిటి? ఈ నిర్ణయం బుట్టదాఖలైంది. అధిక లాభార్జనాపరులు, నిల్వవ్యాపారస్థులు, దళారీలు కృత్రిమ కొరతను సృష్టించారు. అధిక ధరలతో ప్రజలను కొల్లగొడుతున్నారు.

అభివృద్ధిచెందుతున్న ఆర్థిక విధానంలో ఆహార ధాన్యాల ఉత్పత్తిని అధికం చేయడమేకాదు. మిగులు ధాన్యాన్ని అమ్మకానికి వచ్చేటట్టు చేయడంకూడా ప్రధాన విషయం. ఉత్పత్తిదారునికి సరియైన ధర గిట్టుబాటు అయ్యే టట్టు కొనుగోలుదారుకు న్యాయమైన రేటుకు లభ్యమయ్యే టట్టు చూడవలసిన బాధ్యత ప్రభుత్వంమీాద వుంది.

ఈవిధంగా చేయాలంటే ప్రైవేటు వర్తకులు, మిల్లు యజమానులు పంటలరోజుల్లో ఆహారధాన్యాలను అతిచౌకగ

కొనకుండా, ఆ తరువాత ధరలు పెంచకుండా తగిన కట్టుదిట్టం చేయాలి. యుద్ధకాలంలోవలె పూర్తి కంట్రోలు, రేషనింగ్ పద్ధతులు అవలంబించ నక్కరలేకుండానే, పంటల రోజుల్లో ప్రభుత్వమే న్యాయమైన రేటుకు ధాన్యాలను కొని నిల్వ చేసి తరుగు మాసాలలో మార్కెటుకు విడుదలచేయడం ఇందుకు చక్కని మార్గం. ఏకైకమార్గం కూడా. మిగులు ప్రాంతాలలో ప్రభుత్వ ఇటువంటి పద్ధతి అవలంబించాలని రైతు సంఘాలు, వ్యవసాయ కార్మిక సంఘాలు, ప్రజా సంఘాలు నిరంతరం ఆందోళన చేస్తున్న విషయం అందరికీ తెలిసిందే.

## జాతీయాభివృద్ధి సమితి నిర్ణయం

జాతీయాభివృద్ధి సమితి 1958 నవంబరులో ఆహార ధాన్యాల టోకు వర్తకాన్ని ప్రభుత్వమే నిర్వహించాలని నిర్ణయించింది. ఆర్థికశాఖ, ఆహారవ్యవసాయశాఖలు, ప్రణాళికా సంఘం, రిజర్వు బ్యాంకు, స్టేట్ బ్యాంకుల ప్రతినిధులతో ఏర్పరచిన ఒక ఉపసంఘం యిందుకు ఒక పథకాన్ని సంసిద్ధం చేసింది. ఇందులో మొదటిదశ కార్యక్రమంగా, టోకువర్తకులకు లైసెన్సులు యిస్తారు. వారు కొన్న ధాన్యం అంతాగాని, లేక కొంత భాగంగాని ప్రభుత్వం తీసుకోడానికి హక్కుకలిగి ఉంటుంది. టోకువర్తకులు ప్రభుత్వం నిర్ణయించిన కనీస ధరకు ధాన్యాన్ని కొంటారు. ప్రభుత్వంతీసుకోగా మిగిలిన ధాన్యాన్ని కంట్రోలు ధరకు మించకుండా వర్తకులు అమ్ముకోవచ్చు. టోకువర్తకులు కొన్న ధాన్యంలో ప్రభుత్వం క్రమానుగతంగా యెక్కువ భాగాన్ని (మార్కెటెడ్ సర్‌ప్లస్) తన వశం చేసుకుంటూవుంటుంది. ఆ విధంగా మార్కెట్‌ను అదుపులో

వుంచడానికి యత్నించుతుంది. ప్రభుత్వం కొన్న ఈ ధాన్యాన్ని చౌకడిపోల ద్వారా విడుదలచేస్తూ వుంటారు. అవసరమనుకున్న చోట్ల కొనుగోలుదారుకు సరసమైన ధరకు ఆహార ధాన్యాలు లభించేటట్లు చేయడానికి (అంటే యితర వర్తకులు యెక్కువ ధరలకు అమ్ముతూంటే) ఈ చౌకడిపోల అమ్మకాన్ని విస్తృతం చేస్తారు. ఆ విధంగా చిల్లరవర్తకాన్ని కూడా అదుపులోకి తెస్తారు ఇది ఆహార ధాన్యాలలో ప్రభుత్వ వ్యాపారం ప్రారంభ దశ.

ఇక రెండవ దశలో లైసెన్సు పొందిన టోకువర్తకులకు బదులు గ్రామాల స్థాయిలో సేవాసహకార సంఘాలు మిగులు ధాన్యాన్ని ఖరీదు చేస్తాయి. ఆ తర్వాత యీ ధాన్యాన్ని మార్కెటింగ్ సహకారసంఘాలద్వారానూ, ఎపెక్స్ మార్కెటింగ్ సహకార సంఘాలద్వారాను తిరిగి చిల్లర వర్తకులకు, కొనుగోలుదార్ల సహకార సంఘాలకు సరఫరాచేస్తారు. ఇవి ప్రజలకు సరసమైన రేట్లకు ఆహార ధాన్యాలను అందజేస్తాయి. ఈ రెండవదశ కార్యక్రమాన్ని త్వరగా అందుకోడానికి మొదటి దశ కార్యక్రమాన్ని త్వరత్వరగా ముగించుతారు. అందుకు ప్రథమదశలో ఆ నాటికానాడు టోకువర్తకాన్ని సహకార సంఘాల స్వాధీనం చేస్తారు. మార్కెటింగ్, సహకార సంఘాలను విరివిగా స్థాపించుతారు. అభివృద్ధిచేస్తారు.

జాతీయాభివృద్ధి సమితి తయారుచేసిన ఈ కార్యక్రమం అమలుజరుగుతుందనీ, ఈ పథకాన్ని అమలు జరిపితే ప్రస్తుతం "అమ్మబోతే అడివి, కొనబోతే కొరివి" లాగా ఉన్న పరిస్థితి పోతుందనీ, నూటికి 80 మందిగాఉన్న కొనుగోలుదార్లకు సరస

మైన ధరలకు ఆహారధాన్యాలు లభించుతాయనీ అందరూ ఆశించారు. ధరలు పెరుగకుండా ఈ పథకం తోడ్పడుతుందని ఆశపడ్డారు.

కాని ఇన్నాళ్ళూ ఇటు రైతాంగాన్ని, అటు ప్రజలను కొల్లగొట్టడానికి అలవాటుపడిన ధాన్యం వర్తకులు, దళారీలు, ప్రభుత్వం తయారుచేసిన ఈ వ్యాపార పథకాన్ని భగ్నం చేయడానికి, ఓడించడానికి సర్వయత్నాలను చేశారు. అందుకు కాంగ్రెస్ పక్షంలో ఉన్న పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాల ప్రతినిధులు, మితవాద అభివృద్ధి నిరోధకులందరూ మద్దతు యిచ్చారు. ప్రభుత్వం ఆమోదించిన పథకాన్ని ప్రభుత్వ కళ్ళ ముందే ఏ విధంగా ఓత్తుచేశారో చూదాం!

## పథకాన్ని విచ్ఛిన్నం చేయడానికి జరిగిన కుట్ర

ఆహార ధాన్యాలలో ప్రభుత్వ వ్యాపార పథకం ప్రకారం మిగులు రాష్ట్రాలైన ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒరిస్సా, పంజాబు రాష్ట్రాలలో బియ్యం, గోధుమలకు కంట్రోలు ధరలను నిర్ణయించారు. టోకు వర్తకులకు లైసెన్సు యిచ్చారు. కాని ఈ పథకాన్ని భగ్నంచేయదలచిన టోకు వ్యాపారస్తులు ప్రభుత్వానికి ధాన్యం యివ్వడానికి తమ వద్ద సరుకు ఏమీ లేదనీ, ఎందుకంటే ప్రభుత్వం నిర్ణయించిన ధరకు సరకు అమ్మడానికి రైతాంగం ముందుకు రావడంలేదనీ చెప్పసాగారు. కాని వాస్తవం ఏమిటి? రైతాంగంలో నూటికి 20 మందిగా ఉన్న పెద్దపెద్ద భూస్వాములు, ధనిక రైతులు మినహా మిగిలిన సన్నకారు రైతాంగమంతా తమ అవసరాలకోసం పంట కళ్ళాలలోను, పంటలు వచ్చిన కొద్ది కాలం

లోనే అమ్ముకున్నారు. ఈ విధంగా మార్కెట్‌కు వచ్చిన ధాన్యమంతా వర్తకులుకొని నిల్వచేసి బ్లాక్‌మార్కెట్‌లో అమ్మకోసాగారు. ప్రభుత్వానికి ఉత్తచేతులు చూపించ సాగారు.

ఇదే సమయంలో మరొక ప్రధాన పరిణామంకూడా జరిగింది. పెద్దపెద్ద భూస్వాములు, మాజీ జమీందార్లు టోకు వర్తకులుగా రంగంలోకి దిగారు. వీరు తమ వద్దనున్న ధాన్యాన్నే కాక, చిన్న రైతాంగం వద్దనున్న సరకునంతా కొనివేసి నిల్వచేయసాగారు. మిల్లుయజమానులుకూడా ఈ తరగతిలో చేరారు. ఈవిషయాన్ని ఎవరో కాదు, ప్రభుత్వమే అంగీకరించింది.

## జరుగుతున్న మోసం ప్రభుత్వానికి తెలియదా ?

1958 – '59 మార్కెట్ అమ్మకాల సీజను రిపోర్టులో ప్రభుత్వం ఈ విధంగా తెలియజేస్తుంది.

"పెద్ద పెద్ద ఉత్పత్తిదారులు ధాన్యం వ్యాపారంలో ఇప్పుడు ప్రముఖస్థానం ఆక్రమించుకొని కూచున్నారు. వీరు చిన్న ఉత్పత్తిదారులకు అప్పులిచ్చి వారి పంటనంతా ఆకట్టుకొని పండినపంట యావత్తు తమ చేతుల్లో చిక్కించుకొని కూర్చున్నారు. ఆ విధంగా ఈ పెద్ద పెద్ద భూస్వాములు ఒక నైపున ఉత్పత్తిదార్లుగానూ, మరోనైపున వర్తకులుగానూ, మరికొన్ని సందర్భాల్లో వారే మిల్లు యజమానులుగానూ కూడా తయారయ్యారు."

(బెంగాల్ రాష్ట్రంగురించిన మార్కెట్ రిపోర్టు).

ప్రభుత్వం తలపెట్టిన ఆహారధాన్యాల వ్యాపార పథకాన్ని, కంట్రోలు ధరలను టోకువర్తకులు, భూస్వాములు తల్లకిందులు చేస్తున్న విషయం అధికార పక్షానికి కూడా చక్కగా తెలుసు. అఖిలభారత కాంగ్రెస్ కమిటీపత్రిక ఏమంటున్నదో చూడండి.

"ప్రభుత్వం నిర్ణయించిన ధరకు ఎవరూ తమకు సరుకు యివ్వడంలేదని, అందుచేత రూపాయి, అర్థ ఎక్కువపెట్టి కొంటున్నామని ధాన్యం టోకువర్తకులు అంటున్నారు. అయితే వీరుకొన్న సరుకునంతా నిజాయితీగా ప్రభుత్వానికి ఎల్లప్పుడూ చెబుతారని నమ్మకంలేదు. తాము చాలా తక్కువ కొన్నామని చెప్పి, కొన్న సరుకులో ఎక్కువ భాగాన్ని వీరు బ్లాక్ మార్కెటుకు తరలించడం అరుదైన విషయం కాదు.

(ఎ. ఐ. సి. సి. ఎకనామిక్ రివ్యూ, మే 1, 1960.)

## ఆహార ధాన్యాల విచారణ కమిటీ నివేదిక

ప్ర. సో. పార్టీ నాయకుడు (శ్రీ) అశోక మెహతా నాయకత్వాన ప్రభుత్వం నియమించిన ఆహార ధాన్యాల విచారణ కమిటీ 1957 లో నివేదిక సమర్పించుతూ యిలా తెలియజేసింది :

"1955-56 లో ధాన్యాన్ని బాగా నిల్వజేసింది నిస్సందేహంగా వర్తకులే కాని 1956-57 లో చెప్పుకోదగిన ఒక కొత్త పరిణామం సంభవించింది. ఆహారధాన్యాలలో ఎక్కువ భాగాన్ని పెద్ద పెద్ద ఉత్పత్తిదార్లు, మధ్యరకం ఉత్పత్తిదారులు కూడా నిల్వజేశారు. అందువలననే సరుకు మార్కెటుకు

ఎక్కువగా రాలేదు...ఉత్పత్తి పెరిగి ధరలు తగ్గితే సహజంగా మార్కెట్‌కు ఎక్కువ సరుకు రావాలి. కాని ధరలు పెరిగే సూచన లుండటం వలన సరుకుల విడుదలకంటే నిల్వచేయా లన్న ధోరణే ఎక్కువైంది. అందుచేత మామూలుకంటే వర్తకులు ఎక్కువ నిల్వలుపోశారు...ఈవర్తకంలో బ్యాంకులు యిచ్చిన అప్పులుకూడా బాగా వినియోగపడినాయి." (పేజీ44)

అంటే వర్తకులతోబాటు భూస్వాములు కూడా కలిసి సరుకు మార్కెటుకు రాకుండా తొక్కిపెట్టారు. ఇందుకు పెద్దబ్యాంకులు బ్యాంకులు తోడ్పడ్డాయి. దీనితో ధరలు పెరిగి పోయాయి. ఈ పరిస్థితి అంతా ప్రభుత్వానికి తెలియదా? అంటే తెలుసు. తాను వేసిన పథకాన్ని బాహాటంగా సంఘ విద్రోహులైన కొద్దిమంది విచ్ఛిన్నం చేస్తున్నప్పుడు సంఘ శ్రేయస్సుదృష్ట్యా ప్రభుత్వం ఏమిచర్యలు తీసుకుంది? అన్నదే నేటి సమస్య.

ప్రభుత్వోద్యోగులు ధరలు తగ్గించాలనీ, లేదా ఎలె వెన్సులు హెచ్చించాలని కోరుతూ గత్యంతరంలేక సమ్మె చేసినపుడు ప్రభుత్వం యేమని చెప్పింది? సంఘ శ్రేయస్సు ప్రధానమనీ, అందుచేత అల్పసంఖ్యాకులైనవారు అందుకు విరుద్ధంగా నడిస్తే కఠినచర్యలను తీసుకొంటామనీ అంది. ప్రధాని నెహ్రూ పార్లమెంటు సమావేశంలో కూడా అదే అన్నారు.

మరి ధాన్యం వర్తకులు, దళారీ వ్యాపారులు, భూస్వా ములు చేసింది సంఘ శ్రేయస్సుకు అనుగుణ్యమైన పనా? లేక సంఘ విద్రోహకరమైన పనా? ఇందువలన ధరలు పెరగ

లేదా ? మరి ప్రభుత్వం వీరిపై యెటువంటి చర్యలు తీసుకొంది ? ఏ ఆర్డినెన్సులు ప్రకటించింది ? వీరివద్దనుండి ధాన్యాన్ని యెందుకు నిర్బంధంగా స్వాధీనం చేసుకోలేదు ? సమ్మె చేసిన ఉద్యోగులను దాదాపు 15 వేల మందిని అరెస్టు చేసిందికదా ! మరి ప్రభుత్వ విధానాలను బాహాటంగా ధిక్కరించిన పెద్ద పెద్ద వర్తకులను యెంతమందిని ప్రభుత్వం అరెస్టుచేసి శిక్షించింది ?

సమాజ శ్రేయస్సు దృష్ట్యా సమ్మెను అణచివేశామని చెప్పుతున్న ప్రభుత్వం బ్లాక్ మార్కెట్ వర్తకులు మొదలైన సంఘ విద్రోహశక్తులను అణచలేకపోయిందన్న విషయం దాస్తే దాగే సత్యంకాదు.

ఆహారధాన్యాల వ్యాపారాన్ని ప్రభుత్వం చేపట్టడం స్వార్థపరవర్గాలకు, అధిక లాభార్జనపరులకు యిష్టంలేదు. కనుకనే ఆహారమంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ యీ విధానానికి స్వస్తిచెప్పి అమెరికానుండి 50 కోట్ల టన్నుల ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోడానికి ఒప్పందం చేసుకువచ్చారు. ఈ నిల్వను ప్రభుత్వం చేతులో పెట్టుకొని ధరలు పెరిగినప్పుడు విడుదల చేయవచ్చునని వీరి ప్రచారం అయితే దేశంలో సేకరించడానికి వీలైన మిగులు సరకుమాట యేమిటి ? ఆ సరకును విపరీతమైన ధరలకు అమ్ముకోడానికి ధారాదత్తం చేస్తారా ? మరి ధరల స్థిరీకరణ అంటే యిదేనా ?

# ధరల స్థిరీకరణ చర్యలకు ఎవరు వ్యతిరేకులు?

ఈ పరిశీలనబట్టి మనకు బోధపడే దేమిటి? ధరలను స్థిరీకరించాలంటే బ్యాంకువ్యాపారాన్ని రిజర్వుబ్యాంకు చర్యల ద్వారా అదుపులోకి తెచ్చే యత్నాలు సరిపోవు; బ్యాంకు వ్యాపారాన్ని జాతీయంచేయాలి! దీనికి ఎవరు అనుకూలురు? ఎవరు వ్యతిరేకులు?

ఎవరైతే బ్యాంకు ఋణాలద్వారా చట్టా వ్యాపారాన్ని సాగించి అధిక లాభార్జన చేస్తున్నారో, ఎవరు ఈ బ్యాంకుల వలన అధికలాభాలు గడించుతున్నారో, వారు వ్యతిరేకులు. అధిక ధరల వలన బాధపడే ఉద్యోగులతో సహా నూటికి 90 మంది అనుకూలురు!

ధరలను స్థిరీకరించాలంటే అదనపు ద్రవ్య చలామణిని అరికట్టాలి. ఈ అదనపు ద్రవ్యాన్ని చేతుల్లో పెట్టుకొన్న పారిశ్రామిక, వాణిజ్య భూస్వామ్య వర్గాలపై ప్రత్యక్ష పన్నులు విధించాలి. దీనికి యెవరు వ్యతిరేకులు? ప్రణాళికల వలన యేదైనా అదనంగా ఉత్పత్తి జరిగితే, జాతీయాదాయం పెరిగితే అందువలన లాభపడే ధనాఢ్యవర్గాలు వ్యతిరేకం. ఉద్యోగులతో సహా నూటికి 90 మందిగా వుండే ప్రజాసామాన్యం అనుకూలం.

అదేవిధంగా ఋణగ్రస్త ద్రవ్యవిధానం తగ్గించి ప్రణాళికకు కావలసిన ఆర్థిక వనరులకోసం ప్రైవేటు బ్యాంకుల

ద్రవ్యాన్ని, కంపెనీల రిజర్వులను, అరుగుదల నిధులను వినియోగించడానికి యెవరు వ్యతిరేకులు! నిస్సందేహంగా ఉద్యోగులు కాదు. ప్రజలూ కాదు. అత్యల్ప సంఖ్యాకులైన కంపెనీల యజమానులు!

టోకు వర్తకం క్రమక్రమంగా జాతీయం చేయడానికి ఎవరు వ్యతిరేకులు? ఆహారధాన్యాల వ్యాపారాన్ని ప్రభుత్వం వశం చేసుకోడానికి ఎవరు వ్యతిరేకులు? దళారీలు, టోకు వర్తకులు తప్పితే అత్యధిక సంఖ్యాకులైన ప్రజలుమాత్రం కాదు; ఉద్యోగులూ కాదు!

ప్రజల జీవన ప్రమాణాలను పెంచడం, ఆదాయాల వ్యత్యాసాలను తగ్గించటం, ప్రణాళిక ప్రధాన ఆశయాలని, సోషలిస్టు నమూనా సమాజస్థాపనే ప్రణాళికల లక్ష్యమని శ్రీ నెహ్రూ, ఆయన ప్రభుత్వము చెబుతున్నారు కదా, మరి ధరల స్థిరీకరణకు తీసుకోవలసిన పై చర్యలన్నీ ప్రణాళిక ఆశయాలకు, లక్ష్యాలకు అనుగుణ్యమైనవా? వ్యతిరేకమైనవా? రెండు పంచవర్ష ప్రణాళికలు గడిచిపోయినప్పటికీ, ఈచర్యలను ఎందుకు తీసుకోలేదు? ఇదే నేటి ప్రధాన సమస్య!

మన దేశంలో ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానం అభివృద్ధి పొందితే, పెట్టుబడిదారీవర్గ అరాచక ఆర్థిక విధానానికి తావుండదు. విశృంఖలమైన దోపిడీకి, అమిత లాభార్జనకు అవకాశముండదు. ప్రణాళికలో చెప్పినప్రకారం ప్రభుత్వరంగం బలపడితే ప్రయివేటురంగం ఆర్థికవ్యవస్థపై తన ఆధిపత్యాన్ని కోల్పోతుంది. భూమికిగరిష్టపరిమితి నిజంగా ప్రణాళికా సంఘం వాగ్దానం చేసినప్రకారం ఏర్పరచితే, గ్రామీణ ఆర్థిక

వ్యవస్థపై భూస్వాముల ఆధిపత్యం పోతుంది. అదేవిధంగా టోకువర్తకాన్ని సమాజపరంచేస్తే దళారులకు, అధిక లాభార్జన పరులకు స్వస్తి జరుగుతుంది.

అందుచేతనే పంచవర్ష ప్రణాళికలపైనా, ప్రభుత్వరంగం పైనా, భూమి గరిష్ఠ పరిమితిపైనా, ధరలస్థిరీకరణ కార్యక్రమం పైనా, ఒక్కమాటలో ఆవడి, నాగపూర్ కాంగ్రెస్ మహాసభలలో ఆమోదించబడిన ప్రగతిశీలమైన రాజకీయ ఆర్థిక విధానాలపైనా స్వార్థపరవర్గాలు ప్రచ్ఛన్న యుద్ధాన్ని ఆరంభించాయి. రోజు రోజుకు దీనిని ఉధృతంచేస్తున్నాయి. ప్రణాళిక లక్ష్యాలను, ఆశయాలను భగ్నం చేయడానికి, తూట్లు పొడవడానికి శతథా ప్రయత్నిస్తున్నాయి.

## ఉద్యోగుల పోరాటం నిజానికి ఎవరిమీద ?

ధరలు తగ్గించాలనీ, లేదా ధరల పెరుగుదల కష్టగుణ్యంగా అధిక ధరల ఎలవెన్సు పెంచాలనీ కోరుతూ ఉద్యోగులు చేసిన పోరాటం ప్రభుత్వాన్ని కూలదోసే లక్ష్యంతో జరగలేదు. ప్రభుత్వం అనుసరిస్తున్న కొన్ని విధానాలకు మాత్రమే వ్యతిరేకంగా జరిగింది. ఎవరైతే ధరలను పెంచి ప్రజలను కొల్లగొడుతున్నారో వారిపై ప్రకటించిన పరోక్ష యుద్ధం! ఎవరైతే ప్రణాళిక ఆశయాలను వ్యతిరేకించుచున్నారో అటువంటి పెట్టుబడిదారీ, భూస్వామ్యవర్గాలమీద దీని తాకిడి తగులుతుంది.

నెహ్రూ ప్రభుత్వం ప్రణాళికలద్వారా తలపెట్టిన ఆర్థిక విధానాలకు కేంద్రప్రభుత్వోద్యోగులు వ్యతిరేకులా ? కాదు. అనుకూలురు ! అదేవిధంగా సమ్మెను బలపరచిన రాజకీయ

పక్షాలవారు ప్రణాళికాబద్ధమైన ఆర్థిక విధానానికి అనుకూలురు తప్ప వ్యతిరేకులు కాదు.

ఎవరైతే పంచవర్ష ప్రణాళిక ఆశయాలపైన ప్రచ్ఛన్న యుద్ధం ప్రారంభించి ఆ ఆశయాలను భగ్నం చేయాలనీ, తారు మారు చేయాలనీ చూస్తున్నారో, వారితో సామాన్య ప్రజలు, మధ్యతరగతి విద్యార్థులు, వామపక్షాలు నేడు సంఘర్షించు తున్నారు.

కాని దురదృష్టవశాత్తు ప్రధాని నెహ్రూ, ఆయన ప్రభుత్వం యీ పోరాటాన్ని ఊతగా తీసుకొని అభివృద్ధి నిరో ధక వర్గాలమీద యెదురుదాడి చేయాల్సింది పోయి, యీ పోరాటం తమ ప్రభుత్వాన్ని కూలదోయటానికి తలపెట్టినదిగా దుష్ప్రచారం చేశారు. ఉద్యోగులపై దమనవిధానానికి దిగారు. అధిక లాభార్జనపరులపైన, అభివృద్ధి నిరోధకులపైన కఠిన చర్యలు తీసుకోడానికి కేంద్రీకరించవలసిన తమ శక్తి యుక్తు లను ఉద్యోగులపైన, వారిని బలపర్చిన అభివృద్ధికరశక్తులపైన కేంద్రీకరించారు. అధిక ధరల ద్వారా, అక్రమ లాభాలు సంపాదించి ప్రజలను కొల్లగొట్టేవారిపై ఏ ఆర్డినెన్సులూ ప్రకటించలేదు. దొంగ వ్యాపారంచేసే వారినెవరినీ అరెస్టు చేయలేదు. ఉద్యోగులపట్ల అవలంబించిన నిర్బంధ విధానాన్ని ఈ సంఘ వ్యతిరేకశక్తుల పట్ల యెన్నడూ అవలంబించలేదు.

మధ్యతరగతి విద్యార్థులు తమ న్యాయమైన కోర్కెల కోసం పోరాడాలంటే ఈసంఘ వ్యతిరేకశక్తులను ప్రతిఘటించి పోరాడక తప్పదని యింత స్పష్టంగా యింతకుముందెన్నడూ గ్రహించలేదు.

# ముగింపు

20 లక్షలమంది కేంద్రప్రభుత్వోద్యోగులలో అయిదు లక్షలమంది మాత్రమే సమ్మెలో పాల్గొని ఉండవచ్చును. సమ్మె అయిదు రోజులే జరగవచ్చు. ఆ తరువాత ఉద్యోగుల సంఘ సంయుక్త కార్యాచరణసమితి సమ్మెను ఉపసంహరించుకొని ఉండవచ్చు. స్థూల దృష్టితో చూస్తే వారు సమ్మె విఫలమైందని చెప్పవచ్చు. ఈ పోరాటంలో గెలు పెవరిది? ఓటమి ఎవరిది? అని సూటిగా ప్రశ్నించితే గెలుపు ప్రభుత్వానిదీ కాదు, ఓటమి ఉద్యోగులదీ కాదని చెప్పవలసి ఉంటుంది. అఖిలభారత ట్రేడ్‌యూనియన్ కాంగ్రెసు కార్యదర్శి, భారత కమ్యూనిస్టుపార్టీ నాయకుడు అయిన శ్రీ డాంగే చెప్పినట్లు "ధరలను కంట్రోలు చేయవలసిన సమస్యను ప్రభుత్వంచే గుర్తింపజేయడంలో సమ్మె విజయం పొందింది. కేంద్ర ప్రభుత్వం అనుసరిస్తున్న కార్మిక వ్యతిరేక విధానాలను ప్రజలందరికీ అది తెలియజెప్పింది."

సమ్మె అనంతరం ప్రధాని నెహ్రూ, ప్రణాళికా మంత్రి శ్రీ నందా ధరల స్థిరీకరణకు కొన్ని నిర్దిష్టచర్యలు తీసుకోవాలనీ, ఆహారధాన్యాల టోకువ్యాపారాన్ని ప్రభుత్వమే నిర్వహించాలనీ, యింతవరకు పెరిగిన జాతీయాదాయం ఏ యే

వర్గాలకు చేరిందో విచారణ జరిపించాలనీ పార్లమెంటులోను, బయట ప్రకటనలు చేశారు. అధికధరల సమస్యపై ప్రభుత్వం పార్లమెంటు సభ్యుల ఆర్థిక సలహాసంఘానికి తన నివేదికను సమర్పిస్తూ, "కీలక స్థానాల్లో విచక్షణాపూర్వకమైన కంట్రోళ్లు" విధించాలని ప్రతిపాదించింది.

ప్రధాని నెహ్రూ రాజ్యసభలో, విపరీత లాభాలు సంపాదించేవారి స్వేచ్ఛను అరికట్టటానికి తగు ఆంక్షలు విధించాలనీ, యిది ప్రణాళిక ద్వారా సాధించాలన్నదే ప్రభుత్వ నిర్ణయమనీ ప్రధాని నెహ్రూ తెలియజేశారు. ఆహారధాన్యాల్లో ప్రభుత్వం తప్పనిసరిగా వ్యాపారం చేయాలని చెప్పారు.

వాణిజ్య – పరిశ్రమల మంత్రి శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి పరిశ్రమల కేంద్రసలహా సంఘ సమావేశంలో మాట్లాడుతూ, దేశంలో ఏర్పడిన సరకుల కొరతను అవకాశంగా తీసుకొని పరిశ్రమాధిపతులు ధరలను పెంచుతున్నారని విమర్శించారు.

1960 సెప్టెంబరు 16 వ తేదీని జాతీయాభివృద్ధి సమితి సమావేశమై ప్రభుత్వం ఆహారధాన్యాల టోకు వ్యాపారాన్ని చేబట్టాలనీ, కీలకస్థానాల్లో విచక్షణాయుతమైన కంట్రోళ్ళను అమలు జరపాలనీ, ధాన్యసేకరణకు పూనుకోవాలనీ నిర్ణయించింది.

ధరల స్థిరీకరణకు ఈ చర్యలు దోహదమిస్తాయనడంలో సందేహం లేదు. కాని రెండోవైపు ధరల స్థిరీకరణను వ్యతిరేకించేవారు ప్రభుత్వ కీలకస్థానాల్లో ఉన్నారు. ఉదాహరణకు ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీ దేశాయి ఆగస్టు 13 వ అహ

హ్మదాబాద్‌లో ఉపన్యసిస్తూ, "ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరిగినప్పటికీ ధరలిలా మండిపోవటానికి కారణం ప్రజల కొనుగోలుశక్తి పెరగడమే" నన్నారు. సెప్టెంబరు 20 న లండన్‌లో మాట్లాడుతూ ఆయన "భారతదేశంలో ధరల పెరుగుదల ప్రజల కొనుగోలుశక్తికి తార్కాణమన్నారు."

కేంద్ర ఆహారమంత్రి శ్రీ ఎస్. కె. పాటిల్ లోక్ సభలో ఉపన్యసిస్తూ, ఆహార ధరలు పెద్దగా పెరగలేదనీ, ఆ పెరుగుదలకైనా కారణం ప్రభుత్వ వ్యాపార పథకమేననీ విచిత్ర వాదనచేశారు. జాతీయాభివృద్ధి సమితి సమావేశంలో శ్రీ పాటిల్ తప్ప మిగిలిన వారందరూ ఆహారధాన్యాల ప్రభుత్వ వ్యాపార పథకాన్ని సమర్థించారు.

ఈవిధంగా కేంద్ర మంత్రివర్గంలో రెండు పరస్పర విరుద్ధమైన ధోరణులున్నాయి. అందుచేత, ధరల స్థిరీకరణను ఖచ్చితంగా అమలు జరపాలంటే, తీర్మానాలు - నిర్ణయాలు చేయడంతోబాటు వాటిని వ్యతిరేకించే వారిని బాధ్యతాయుత స్థానాల్లోనుంచి తొలగించడం అవసరం. అంతేకాదు. వారింత వరకు అవలంబిస్తున్న అభివృద్ధి నిరోధక విధానాలకు స్వస్తి చెప్పి, ఈక్రింది చర్యలకు ప్రభుత్వం పూనుకోవలసియుంటుంది.

1. ధరల స్థిరీకరణకు ముఖ్య ప్రతిబంధకంగా ఉన్న ప్రైవేటు బ్యాంకుల ద్రవ్య చలామణీని అరికట్టాలి. బ్యాంకు వ్యాపారాన్ని జాతీయంచేయాలి, (2) చట్టా వ్యాపారాన్ని నిషేధించాలి, (3) ఆహారధాన్యాల వ్యాపారాన్ని ప్రభుత్వం వశం చేసుకోవాలి. మధ్యదళారులను తొలగించి సహకార

సంఘూపరం చేయాలి. (4) మొరార్జీ దేశాయి బడ్జెట్లను పూర్తిగా మార్చివేసి పెట్టుబడిదారులపై పడే డివిడెండ్లపై పన్ను, మరణసుంకాలపన్ను, ప్రత్యక్ష పన్నులు హెచ్చించాలి. వ్యావసాయాదాయాలపై పన్ను విధించాలి. పరోక్షపన్నులు తగ్గించాలి. జీవితావసరవస్తువుల పన్నులు తగ్గించి, విలాసవస్తువులపై పన్నులు హెచ్చించాలి. (5) ఋణగ్రస్త ద్రవ్య విధానం వలన అదనంగా చలామణీలోకి వచ్చిన ద్రవ్యాన్ని పరిహరించడానికి హెచ్చుగా అధికలాభాల పన్ను విధించాలి. (6) వ్యక్తుల ఆదాయాలకు పరిమితి విధించాలి.

ప్రజలపై పన్నులు తగ్గించిన మేరకు భర్తీ చేసుకోడానికి ప్రణాళిక ఆర్థిక వనరుల సేకరించడానికి యీ దిగువ చర్యలు తీసుకోవాలి.

1. జీవిత భీమా కార్పొరేషన్‌లో ప్రస్తుతం ఏటా 40 కోట్ల వరకు నిధులు పెట్టుబడి పెట్టడానికి లభ్యమవుతున్నాయి. దీనిని 50 కోట్లకు పెంచడానికి అవకాశం వుంది. ఈ నిధులతో యిప్పుడు జీవితభీమా కార్పొరేషన్ అధికారులు ముంద్రా షేర్ల వంటి షేర్లు కొంటున్నారు. షేర్ మార్కెట్ వ్యాపారం చేస్తున్నారు. సంవత్సరానికి 50 కోట్ల చొప్పున లభ్యమయ్యే యీ నిధులను ప్రభుత్వ రంగంలో పెట్టుబడిగా పెట్టాలి.
2. ప్రైవేటురంగంలో వివిధపరిశ్రమల్లో వున్న రిజర్వ్ నిధులను, అనుగుదల నిధులను ప్రభుత్వంవద్ద డిపాజిట్ చేయించుకోవాలి.
3. గుత్తకంపెనీలు ఏర్పడకుండా, పరిశ్రమలపై గుత్తాధిపత్యం ఏర్పడకుండా నిర్దిష్ట చర్యలు తీసుకోవాలి. ప్రస్తుతం ఒక పరిశ్రమలో వచ్చిన లాభాలను, వివిధరకాల నిధులను, వివిధరకాల

పరిశ్రమలలో వాటాలు కొని పెట్టుబడి పెట్టడానికి వినియోగిస్తున్నారు. పన్నుల ఎగవేతకు, అనేక అనర్థాలకు ఇది దారి తీస్తోంది. ప్రభుత్వం ఈ పద్ధతులను వెంటనే అరికట్టి, దేశానికి అవసరమైన పరిశ్రమల స్థాపనకు వినియోగించాలి. 4. విదేశీ నూనె కంపెనీల ధరలను ఇంకా తగ్గించాలి. ఈ విదేశీ కంపెనీలపై మరికొంత పన్నులరూపంలో ఆదాయం రాబట్టాలి.

